# చంద్రగుప్త

ద్విజేంద్రలాల్ రాయని వంగనాటకమునకు తెనుగు.

గ్రంథకర్త.

శ్రీపాద కామేశ్వరరావు.

రెండవ సంస్కరణము

ప్రకాశకులు

చెఱుకువాడ వేంకటరామయ్య

అభినవాంధ్రగ్రంథమాలా కార్యాలయము

రాజమండ్రి

సరస్వతీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరము.

1926

 వెల 1—4—0

కన్నులను నన్నునోకసారి గాంచలేదు,
వీనులను నాదుపల్కులు వినగలేదు,
వసుధ నిర్వ్యాదయుగా చెంప్లె నయసునందె
విడిచి యెందేగెనో కని విని యెఱుంగ;
నెప్పుడును నన్ను కంటికి ఱెప్పవోలె
గాచుచుండును నాఁబోలుఁ గన్నప్రేమ
నప్పుడప్పుడు హితమును చెప్పుచుండు
నప్పనము శ్రీ॥ మహేశ్వరుని యాత్మ్యాది.

శ్రీ॥ కా॥

మొదటికూర్పు జూలై 1925
రెండవకూర్పు మార్చి 1926

# నాటకమందలి ముఖ్యపాత్రములు

## పురుషులు

| | |
|---|---|
| నందుడు | మగధరాజు |
| చంద్రగుప్తుడు | నందుని సవతియన్న |
| వాచాలుడు | నందునిభార్యకు సోదరుడు |
| చాణక్యుడు | బ్రాహ్మణుడు |
| కాత్యాయనుడు | నందుని మంత్రి |
| చంద్రకేతు | మలయరాజు |
| సికందర్ | గ్రీసుసార్వభౌముడు |
| సెల్యూకస్ | సికిందరు సేనాపతి |
| ఏంటియోకస్ | యవన సేనాని |

## స్త్రీలు.

| | |
|---|---|
| హెలెన్ | సెల్యూకసు కూతురు |
| ఛాయ | చంద్రకేతుని సోదరి |
| ముర | చంద్రగుప్తుని తల్లి |

హెచ్చరిక — గ్రంథకర్త యనుమతి లేక యీనాటక మెవ్వరు నాడఁగూడదు.

గ్రమై, గంభీరభావమును నిల్చియున్నది. ఇందలి విశాలములగు నదీనదములు పూర్ణములై యిరుదట్టుల నురుగులు గ్రక్కుచు ప్రవహించుచున్నవి. ఇందలి మరుభూములు స్వేచ్ఛాచారులబోలె తప్తసికతాపుంజమును దశదిశల నెగురజిమ్ముచున్నవి.

సెల్యూ—సార్వభౌమశేఖరా! నిజము.

నికం—ఎటుచూచినను ఆకాశవృక్షములు శిరములనుప్పైకెత్తి తమదర్పమును ప్రకటించుచున్నవి. విశాలములగు వటరాజములు స్నిగ్ధచ్ఛాయల నలుదిక్కులజూచుచున్నవి. కొండలబోలు గంధసింధురంబులు గుంపులుగుంపులుగ నల్లెడల మెల్లమెల్లన చలించుచున్నవి. అతిదీర్ఘములగు నజగరములలసనృపాలుని పాలనమువోలె వక్రములై పడియున్నవి. పృథములై తీక్ష్ణములగు కొమ్ములుగలహరిణములు ముగ్ధవిస్మయము ననుకరించుచు నిర్జనవనములందు శూన్యదృష్టుల సారించుచున్నవి. ఇందుసర్వోత్తమమగు విషయమిది;—సౌమ్యులు, గౌరవర్ణయుతులు సుందరులునగు జనులీ భరతవర్షమును పాలించుచున్నారు. వారిముఖముల శిశుసారళ్యము తాండవమాడుచున్నను దేహమందు వజ్రకల్పమగు శక్తి, కనులయందు దినకరతేజమును వక్షమున ప్రళయనిభమగు సాహసము వాసము జేయుచున్నవి. ఇట్టివారిశౌర్యమును బరాజితమొనర్చుటయే వీరులకు పరమానందదాయకము. వీరి రాజగు బురుషోత్తముని నేను ఖైదుజేసినప్పు డాత డేమనెనో వింటివా?

సెల్యూ—ఏమనెను?

సికం—“అయ్యా, నేనేప్రకారము నీయెడవర్తింతు ననుకొంటివి? ” అని సేయడుగ, నిర్భీకుడై నిష్కంపస్వరమున, “ఒకరాజునెడ నేరొకరాజెట్లు ప్రవర్తింప జెల్లునో, అట్లు” అని యుత్తరమిచ్చెను. దానికచ్చెరువంది, యాతడుత్తమవీరుడని యెఱిగి, వానిరాజ్యము వానికిచ్చి వేసితిని.

సెల్యూ—ప్రభువువారు మహానుభావులు.

సికం—మహానుభావుడనా? ఆతడట్లుత్తరమీయ నే నన్యమేమి సేయనగు? వానిమహత్త్వముజూడ నామనమున నానావిధములగు నుల్లాసముదయించెను. ఇచ్చట సామ్రాజ్యస్థాపనము సేయ నేరాలేదు; విలాసార్థము దిగ్విజయమొనర్చి ప్రపంచమున నాకీర్తి చిరస్థాయిగా జేయుటయే నాముఖ్యోద్దేశము.

సెల్యూ—అట్లయిన దేవరవారీదిగ్విజయము నసంపూర్ణముగవిడిచి దేశమునకు మరలబోవనెంచిరేల?

సికం—ఈదిగ్విజయము సాంతము జేయవలెనన్న నూతనయవనసైన్య మావశ్యకము. ఈసేన దానెట్టియుద్ధముల గెలిచినను నాచే మహాశ్చర్యజనకములగు కార్యముల నిర్వహింప జేసినది. యవనదేశమంనలి మేసిడనెక్కడ? భారతవర్షమెక్కడ? ఇంతదూరము జయప్రదముగా వచ్చుట యదృష్టశ్రుతపూర్వముకాదా? త్రోవలో నెన్ని రాజ్యములనునెన్ని జనపదముల నంఖప్రాయముగ పదదళితముచేయుచు వచ్చితిని! రఘుంధ్రాగానిలములీల నిందు బ్రవేశించి గొప్పగొప్పసైన్యసమూహముల

ధూమరాశింబోలె నెగురగొట్టి, దాదాపు సగమాశియాను యవనవిజయవాహినీవీరపద భారమున గంపితమగున ట్లొనరించితిని. మహామారిభాతి దుర్వారమై, మృత్యువువలె భయంకరమై, దుర్భిక్షమురీతి నిష్ఠురమై, రుధిరాక్తమగు నావిజయశకటమును నిరాటంకముగ నింతదూరము పృథ్వీవక్షమున దోలుకొని వచ్చితిని. కాని యీశతద్రూనదీతీరమున బ్రప్రథమమున మహాకష్టముల పాలైతిని.

(చంద్రగుప్తుని బట్టుకొని ఏంటిగోనసువచ్చును)

ఏమి సేనానీ! ఇటువచ్చితివి ? ఆతడెవడు?

ఏంటి—మహాప్రభూ! గూఢచారుడు.

సెల్యూ—ఆఁ! ఏమిది?

సికం—గూఢచారుడా?

ఏం—ఔను. ఈతడొక శిబిరసమీపమున నొంటరిగా గూర్చుండి, యెండిన దాటియాకుపై నెద్దియో వ్రాయుచుండెను. నేను దాని జూచుమన నీతడు జూపెను, కాని నే జదువలేనైతిని; కావున నేలినవారి సముఖమునకు దెచ్చితిని.

సికం—ఓయీ! నీ వేమి వ్రాయుచుంటివి ? నిజము చెప్పుము.

చంద్ర—రాజాధిరాజా! నిజము జెప్పవలెనా? భారతవాసులబద్ధమాడుట నీసరికి నేర్చుకొనలేదు. నిజమే చెప్పెద.

సిక——(సెల్యూకసువైపుజూచి) బాగుబాగు! నిజము చెప్పుము. ఏమి వ్రాయుచుంటివి?

చంద్ర——ప్రభువు వారి సైన్యసంచాలనము, వ్యూహ రచనాప్రణాళి, సామరిక నియమములను నేనొక కిలనుండి. నేర్చుకొనుచుంటిని.

సికం——ఎవరియొద్ద ?

చంద్ర—— ఈ సేనానియొద్ద (సెల్యూకసును చూపును)

సికం——ఈమాట సత్యమే?

సెల్యూ——అహా! సత్యమే.

సికం——తరువాత.

చం॥గు॥——యవన సేన ఇటనుండి స్వదేశమునకు రేపు పోవునని విని, నేను నేర్చుకొనిన విషయములను వ్రాసుకొను చుంటిని.

సికం——ఏ యుద్దేశముతో?

చం॥గు॥——ప్రభువు వారితో బోరుటకై కాదు.

సికం——కాకున్న?

చం॥గు॥——సార్వభౌమా! ఆలకింపుడు, నేను మగధ రాజ పుత్త్రుడనగు చంద్రగుప్తుడను, నాతండ్రి మహాపద్మ నందుడు, నాసవతితమ్ముడగు నందుడు సింహాసనారూఢు డై నన్ను దేశమునుండి తరిమెను, దానికి బ్రతీకారము సేయు టకై దేశములు తిరుగుచూ, యవన భూపతులగు మీయద్భు తవార్తల వింటిని. తామఖండ వ్యాప్తమగు రాష్ట్రమును

బదదళితమోనర్చి, నదనదీ పర్వతముల దుర్వార పరాక్రమమున నతిక్రమించి భారతవర్షము ప్రవేశించి, యార్యకులరవియగు పురుషోత్తము నోడించితిరని వినినతోడనే, సార్వభౌమా! ఎవ్వనిభ్రుకుటీ దర్శన మాత్రమున నర్ధఖండము పాదాక్రాంతమయ్యెనో, అట్టిశూరుని పరాక్రమ మెట్టిదో కని వత్తమను కోర్కెబుట్టెను. ఏశక్తి సంఘాతమున నార్యుల మహావీర్యము విచలితమయ్యె నట్టి శక్తి యెందుడాగి యున్నదో కనుగొందమని యిటవచ్చి, మీసేనాధిపతియొద్ద యుద్ధమర్మముల నేర్చుకొనుచుంటిని. మీరిటనుండి వెడలిన తోడనే యపహృత రాజ్యము నాక్రమించు కొనుటయే నాముఖ్యోద్దేశము. అందుకే యుద్ధమర్మముల జ్ఞప్తినుంచు కొనుటకు వ్రాసికొనుచుంటిని.

సెల్యూ—ఈవృత్తాంతము నే నెఱుగను! ఈయువకునిరూపు, ఠీవి, మాటల పొందిక, శౌర్యము, స్థైర్యము ఉదారభావమును నామనసునకు నచ్చెను. అందుచే నీతనితో యవనసామరిక విధానము లప్పుడప్పుడు చర్చించుచుంటిని. ఈతడు విశ్వాసఘాతకుడని యిప్పుడెఱింగితిని.

ఏంటి—విశ్వాసఘాతకు డెవరు?

సెల్యూ—ఈ యువకుడు.

ఏంటి—అతడు కాడు, మీరు. ముక్కుమొగమెఱుంగని వానికి సమరమర్మములు దెలుపవచ్చునా?

సెల్యూ—ఓయీ! పెద్దవాడనగు నన్నిట్లవమానిం

తువా? పోనిమ్ము. నాపదవి జూచియైన నన్ను మన్నింప వలదా?

ఏంటి—అయ్యా! మీరు యవనసేనాధిపతులని యెరుగుదును. ఐనను విశ్వాసఘాతకులే యని నొక్కి వక్కాణింతును.

సెల్యూ—ఓరీ! మూర్ఖా! ఏమంటివి? (కత్తిదూయును.)

(ఏంటిమోకసు కత్తిదూసి సెల్యూకసుపై నురకబోవ, చంద్రగుప్తుఁడు వారించును. ఏంటిమోకసు చంద్రగుప్తు లొండొరుల నరుకబోవ—)

సికం—ఆగు డాగుడు. ఏంటిమోకస్! పెద్దలయెడ వర్తింపవలసిన విధ మిద్దియా? ఈయత్యాచారమునకు నిన్నిప్పుడే నారాజ్యమునుండి నిర్వాసితుని జేసితిని. సామాన్య సైన్యాధ్యక్షున కింత తలబిరుసా? నేనింతదనుక నిశ్చేష్టుఁడనై చూచుచుంటిని! నీవిట్టియాగడము సల్పుదువని కలనైన దలపనైతిని. పొమ్ము. నారాజ్యమున నుండదగవు. సెల్యూకస్! నీయపరాధ మంత ఘనముకాదు, కాని యవనసార్వభౌము నెదుట నాతనిసేనాధిపతి గుడ్లెఱ్ఱజేయుట శోభాకరముగాదని మాత్రమెఱుంగుము. కోపమునకు దేశకాలపాత్రములుండవా? ఓయీ, యువకుఁడా! నిన్నిప్పుడు ఖైదుచేసిన?

చం॥ గు॥—ఏ యపరాధమునకు? సమ్రాట్!

సికం—శత్రువులచే బంపబడి నాసేనలో దూరితివి. ఇది తప్పుకాదా?

చం॥ గు॥—ఇదియూ నాయపరాధము! సికందరు చక్రవర్తి మహావీరుడని వింటిని, కాని గృహహీనుడు నసహాయుడు నగు నొకహిందూ రాజపుత్రుడు తనయొద్ద యుద్ధమర్మముల నేర్చుకొనవచ్చిన, వాని జూచి భయపడునంత పిరికివాడని నేను ప్రత్యక్షముగా గన్గొంటిని. ఓహో! యవన సార్వభౌము డిట్టి కాపురుషుడని నే దలపనైతి!

సికం—సెల్యూకస్! వీని జెయిలో ద్రోయుము.

సెల్యూ—ఎవడురా అక్కడ? (భటులు వత్తురు)

చం॥ గు॥—సార్వభౌమా! నాబొందిలో బ్రాణములుండు నంతవరకు నన్ను జెరలో ద్రోయజాలవు. (కత్తిదూయును)

సికం—మేలు! శూరాగ్రేసరా! మేలు! నీయిచ్చవచ్చినట్లుండుము. నిన్ను జెయిబెట్టను, ఊరక బరీక్ష జేసితిని. నిర్భయుడవై నీరాజ్యమునకు బొమ్ము. నీకొక పరమరహస్యము చెప్పెదను. దానిజ్ఞప్తియం దుంచుము. అపహృతరాజ్యము నార్జించి దుర్జయుడవై దిగ్విజయము సేయుదువు. నీవు ముక్తుడవు. పొమ్ము.



రెండవ రంగము

---

(శ్మశానమందు చాణక్యుడు ప్రవేశించును)

చాణ—జలప్రాయమగు నీప్రదేశమం దెల్లడ ధూమ పుంజము లెగయుచున్నవి, కుళ్ళిన యెముకల దుర్గంధము నలుగడల వ్యాప్తమగుటచే నూపిరాడుటగూడ కష్టమగు చున్నది. కుక్కల వికటభీంకార మీనిర్జనస్థలమందలి స్తబ్ధత్వ మునకు భంగము కలిగించుచున్నది. సంధ్యాకన్యకు కాయ మంతయు గాయముపడి చీమునెత్తురు కారుచున్నవి. ఓహో! బీభత్సకాంతా! నీవింతసుందరివా? అట్లైన నేనను దినమును ప్రాతఃకాలమున నూరువదలివచ్చి నీకుత్సితప్రవాహమున మున్గుచుందును. ప్రేయసీ! నీవొసర్చిన సద్బోధనమునకు నిన్నెంతని కొనియాడుదు? సంసారమునందసహ్యత, క్రాంతి యందు విముఖత, విధాతృదౌరాత్మ్యమునెడ నసహనభా వము మొదలగు సుగుణముల నీసమ్ముఖమ్మున నేకదా నేర్చు కొంటిని. సుందరీ! ఈలోకమునకు దూరముగ నన్ను గొని పొమ్ము. ఎట్టి ఘోరనరకకూపమునకైనసరా సరే, వలదనను; ఈప్రపంచమునుండి తొలగిన జాలును...(ముల్లుగ్రుచ్చు కొనును)

(కాత్యాయనుడు ప్రవేశించును.)

అన్నా! నేను దరిద్రుడను నీచుడను నిస్సహాయుడ నని యెంచి కంటకమా! నీవుకూడా నన్ను బాధింపవచ్చి

తివా? కాసీ, ఆగుము; నీదుంప తెంపక మానను (పటికి పార వైచి) ఇక నెవ్వరికాలిలోనైన గ్రుచ్చుకొందువా?

కాత్యా—ఆర్యా, నమస్కారము.

చాణ—నీ వెవడవు?

కాత్యా-నంద మహారాజు మంత్రిని, కాత్యాయనుడను.

చాణ—అట్లైన దూరముగ బొమ్ము. నందుని మంత్రివా? నాదగ్గర రాకుము.

కాత్యా—ఏమిది? నానేరమేమి?

చాణ—లేదు నాయనా! నీవలన నపరాధముండునా? నీవపరాధము సేయనేరవు, మీరాజుగూడ అపరాధము సేయ నేరడు, పరమేశ్వరుడూ అపరాధకాడు; అపరాధమంతయు నాది. మీమహారాజు విప్రధనమని వెనుదీయక నాసంపద నందయు హరించె, అది నాయపరాధమే. ఈశ్వరుడు నన్ను సర్వశూన్యుని జేయనెంచి నాగృహలక్ష్మి నకాలమృత్యువు వాత బలవంతముగ ద్రోసికొనిపోయెను, అదియు నాయపరాధమే. బందిపోటుదొంగలు నాకూతు నపహరించిరి, అదియు నాయపరాధమే. నేను దీనుడ దరిద్రుడ నసహాయుడనని యెంచి యీకంటకముగూడ తలయెత్తి నన్ను బాధింప జొచ్చె. అదియు నాతప్పే! (ముల్లుతో) ఏమే? గ్రుచ్చుకొన వేమి, గ్రుచ్చుకో, గ్రుచ్చుకో, నీ దుంప తెగ!

కాత్యా—పండితవర్యా! నీదర్శనార్థ మిట వచ్చితిని.

చాణ—అమాత్యవర్యా! ఏమంటివి? నాదగ్గరనేమి యులేదే, పూర్ణానుస్వారస్వరూపుడను, ఏకాకిని; ఒక పాడు గుడిసెయున్నది, కావలెనన్న దాని నీవు కొనిపొమ్ము, వలతు వేని దానికి నిప్పంటించుము. ఆహా! ఇప్పటి బ్రాహ్మణున కప్పటి ప్రభావమే యుండెనా—

కాత్యా—ప్రతాపము లేకేమి? పాణిని చెప్పలేదా?

✓ చాణ—లేదు. లేదు. దోషమంతయు మనయందే యున్నది. మొదటనుండి తక్కినవర్ణములకు విద్య, యశము, శాంతి, సామర్థ్యము నలవడజేయక అంతయు మనమే జుర్రుకొన్న మనవర్ణముమాత్ర మభివృద్ధిజెందునా? కడుపును గాల్చి కాయమును గాసిలచేయు మొదడు మెలకువతో మెలగునా; ఈదశ నెవ్వరేని సహింతురా? కల్ల, సహింపజాలరు; అందువనే యధఃపతనము నాటిల్లె—ప్రేయసీ! నీవు చెప్పుము. ఎవరు సహింతురు? లేకున్న నిట్టి యధఃపతన మెట్లు సంభవించును? ✓

కాత్యా—ఈకాంత యెవతె? ఈతడిప్పు డెవతెతో మాటలాడుచున్నాడు?

చాణ—అయ్యయ్యో! ఏమి యధఃపతనము! పర్వత శిఖరమునుండి యొక్క పెట్టున పాతాళమునకు క్రుంగుటయా? నేడు బ్రాహ్మణు డెలుకవలె నింటిలోని యంధకారబంధురం బగు నొకకలుగునుండి వేరొకకలుగులోనికి దూరుటకు దల నంచుకొనియుండవలయునా? అయ్యో! నాలుగుబియ్యపు

గింజల నడిగికొనుటకై యూరెల్ల దిరుగవలసి వచ్చెనుకదా! ఛీ! ఛీ! సిగ్గుబిడియములులేవు. మున్నొకనాడు బ్రాహ్మణుని యజ్ఞోపవీతమునుజూచి దేవేంద్రునంత వాడు సైత మైరావతమునుండి దిగి పాదాక్రాంతుడయ్యె. ఎవ్వనిపదాఘాతము నకు సాక్షాన్నారాయణుండు నిజవక్షమును సగర్వముగా నొసంగెనో, అట్టిబ్రాహ్మణుడు నేడు పిడికెడుభిక్షకై యింటింట దిరుగవలసివచ్చె. ఆహా! ఎంతవిపరీతమగు భంగపాటు!

కాత్యా—బ్రాహ్మణు డధఃపతనుడైనను దిరుగ నుచ్చపదము బొందగలడు.

చాణ—అసంభవము!ఆ సామర్థ్యము వాని వీడినది... ఏమి శ్రేయసీ! వీడలేదా?

కాత్యా—అట్లనెదరేల? ఇప్పటికిని బ్రాహ్మణుడే మంత్రి, ఆతడే పురోహితుడు, ఆతడే విదూషకుడు, చట్టముల నిర్మించువాడు బ్రాహ్మణుడే; బ్రాహ్మణజాతి స్వర్ణసూత్రముభాతి సమాజమును హారమునం దంతర్వ్యాప్తియగుచున్నది.

చాణ—చీకటి మూయుచున్నది, చూడుము. (వ్రేలితో చూపును.)

కాత్యా—బ్రాహ్మణుడే తనచేతులతో ప్రభుత్వమును బోగొట్టుకొనెను, కావున నాతడే దాని నుద్ధరింప సమర్థుడు. అయ్యా! ఈయుద్దేశముతోడనే మీచెంతకు జేరితిని.

చాణ—ఎట్లు?

కాత్యా—నేడు మహారాజుతండ్రిగారి యాబ్దికము, తాము పురోహితులై దాని నడిపింపవలయును.

చాణ—మంత్రివరా! నేనుదీనుడ. దరిద్రుడ, నసహాయుడను. కూటికి నేనుండిన లేఖుండదు నిజము; కాని మహారాజుగారికి పౌరోహిత్యము మాత్రము చేయను. చంపినను నరే, క్షత్రియుని దాసత్వమును చేయను. "విశ్వాసో నైవకర్తవ్యః స్త్రీషు రాజకులేషు చ."

కాత్యా—బ్రాహ్మణోత్తమా! ఒక మనవి.

చాణ—ఓహోహో! ఏమి నీ దౌరాత్మ్యము! నాగుడిసెలోపడి నన్నేమనవీయవా?

కాత్యా—అయ్యా! పురుషున కేడ్పొప్పునా?

చాణ—ఔను-సత్యము. పురుషున కేడ్పొప్పదు. కాని నన్నేమి చేయుమందువు? ఎట్టికష్టపరంపర పైబడినను నన్నేమియు జేయజాలకుండెను, కాని తుదకు నాకూతురి నపహరించునరికి మతిచెడి వెన్నువిఱిగినది.

కాత్యా-(తనలో) ఈతని హృదయ మింతకోమలమా?

చాణ—అమాత్యవర్యా! కార్యాంతరమున నేనూరికిబోయి యొకనాడింటికి మరలివచ్చునరికి నాసేవకుడు దేహముపై స్మృతిదప్పి పడియుండెను, లోపలికిబోయి చూడ నా కూతురు మంచముపై లేదు. నారక్తమంతయు వేడిజెంది యొడలెల్ల ప్రవహింపజొచ్చి, కన్నులు చీకటిగ్రమ్మెను. పృథ్వి నుండి వేడియావిరిపుట్టి గగన మంటబోవుచుండెను. నిమ్మట పిచ్చివానివలె బ్రతివీథినిబడి "కూతురా! కూతురా!" యని యరచుచు పరువెత్తసాగితిని, ప్రాంతముననున్న కాంతార

మున పక్షులు రోదజేయసాగెను, నదియొడ్డున నిలిచి బిగ్గరగా బిలిచితిని, కాని గంగాదోడ్డులనంటిపారు యేటిగోలతప్ప వేరుత్తరము లేదాయె, తోడనే మూర్ఛవచ్చి నేలపై బడితిని.

కాత్యా—పండితులగు మీరిట్లు ధైర్యము విడనాడగునా?

చాణ—అధీరుడనా? పదఘట్టనమున పృథ్వినెల్ల చూర్ణప్రాయముగజేసి యెగురగొట్టగలను; వలయునన్న బాష్పధారాపాతమున భూభాగములనెల్ల ముంచివేయగలను. కాని నాకన్నీరంతయు నెండిపోయినదో, లేక ఘనీభవించి హృదయము నావరించియున్నదో తెలియదు. ఇంతదనుక నాయెడ నపచారము చేసిచేసి బ్రహ్మయు తుదకు విసిగి యెక్కడనో దాగియున్నాడు. కావుననే నాకగపడ లేదు.

కాత్యా—మీకీశ్వరదర్శనము తిరుగ గాగలదు. మేఘపటల మాకాశమున చిరస్థాయిగా నుండునా? ఒంటరిగా గూరుచుండి వాపోవుట మాని, నవప్రయత్నమునకు నడుము గట్టి కర్మప్రవాహమున గాలువెట్టుము. కార్యమయమగు నీలోకమున నూరక గూర్చుండిన కొరగామియగును!

✓ చాణ—మీరు జెప్పునదిసత్యము. కాలుసాచి కూర్చుండిన కార్యముసాగదు. నిర్వ్యాపారత్వము కాపురుష లక్షణమే.

కాత్యా—మనుష్యజీవితము సుఖ దుఃఖపూరితము. వెలుగును చీకటియు కాలవికాసభావములు. ఒకదాని వెంబడి

కలికాలమున నొక క్షత్రియాపసదు డొక బ్రాహ్మణుని "ఇక్కడనుండి పొమ్మ"ని గర్జించుచున్నాడు, ఇంకను బ్రళయమాసన్నము కాలేదు! అగ్నివృష్టి కలుగదాయె! పృథ్వీకంపింపదాయె; ఉత్పాతములేవియు పుట్టవాయె. ఏమివింత!

నందు — చూచెదరేమి! — మెడబట్టి గెంటివేయుడు.

వాచా — పోరా పక్షీ! బికారీ! (గెంటును)

చాణ — భగవతీ వసుంధరా! బద్దలుకావేమి? ఓరీ బ్రాహ్మణాధమా! జడునిభంగి నిలిచెదవేమిరా? ప్రపంచమంతయు నిన్ను పరిహసించుచున్నదే. ఇంకను ధనవంతుల కొంపలకుబోయి వారిసేవజేయుచు బిచ్చమెత్తుకొన జూచెదవా? సిగ్గులేదా? శక్తియున్నచో లేచి కపిలుని మాడ్కి యగ్నివృష్టిచే వీరి గర్వమును ఖర్వము సేయుము. అట్టిశక్తి లేకున్న క్షుద్రుడా! పాపీ! జీవచ్ఛవమా! మొగమెత్తుకొని తిరుగకుము. చాల్చాలు నీసిగ్గుమాలినతనము. భూబిలమందెందేని జచ్చినట్లు పడియుండుము.

నందు — ఏమిది! ఈపిచ్చివానికూతలు వినుటకా యిట వచ్చితిమి? వాచాలా! వీని నవలకు బంపు.

వాచా — (చాణక్యుని జుట్టుపట్టి) పోరా! పక్షీ! బికారీ! (త్రోసివేయును)

చాణ — సరే-పోవుచున్నాను; తత్పూర్వమొకమాట జెప్పెద ఓరీ రాజాధమా! ఎంతకలికాలమైనను బ్రహ్మతేజము దుర్వారముసుమా; నాప్రతాపమును కొలదికాలములో

గించుము; నందవంశము నాశముసేయకున్న నేను చణకుని సుతుడగాను. నిర్వక్తమున సిక్తమగు నాచేతులతో శిఖను ముడివేసుకొందును. అంతదనుక విరిసిన వెండ్రుకలిట్లేయుండును. ఇదియే నాప్రతిజ్ఞ...(పోయితిరుగవచ్చి)

ఇంకొకమాట. ఒకానొకనాడీభిక్షుకుని పాదములపై బడి నీవు ప్రాణభిక్ష నడుగగలవు, నేనాభిక్ష నొసంగను. అప్పుడు బ్రాహ్మణుల ప్రతాపపటిమ, పృథ్వీసురుల ప్రతిభా ప్రభావము, పారుల ప్రతిజ్ఞాబలము, శాపాయుధుల శక్తిసామర్థ్యము, విప్రకోపానలతీవ్రతమ తేజము, దుర్వారతాపము నెరుంగగలవు...(పోవును)

నందు—(నివ్వెరబడి) ఈతడెవడు? ఏమంటివి? ఈతని వృత్తాంతమేమి?

వాచా—ఈమూర్ఖజనశిఖామణి పౌరోహిత్యము సేయుటకై మననగరునకు వచ్చెను, నేనదివర కింకొకని పిలిపించితిని, కావున పొమ్మని చెప్పితి, వెళ్ళడాయె; అప్పుడు మెడబట్టి గెంటితిని, నేను చేసినదింతే.

నంద—ఓయీ! బ్రాహ్మణు నిట్లలచేసితివి?

వాచా—నేను రాజస్యాలకుడను—

1 సభ్యు—మంచిపనిజేసితివి. నాకు నచ్చినది. తగిన శాస్తి జేసితివి.

నంద—ఉత్సవభంగ మొనర్చెను.

వాచా—కావున ఉరిదీయవలయును.

నొకటి సంభవించుచుండును. మీరొకరే కష్టములపాలైతిరా? నేను పడిన దుఃఖముల మీరెరుగరు. ఈరాజునాజ్ఞచే నాకన్నులముందర నేడ్గురుసుతు లాహారము లేక మడియు చుండుట జూచితిని.

చాణ—అటులనా? అట్లయ్యు వానియొద్దనే మంత్రిగా నుంటివిగా?

కాత్యా—ఏమిసేయుదు? కేవలప్రతికర్తవ్య మొనర్చుటకు నిగిలియుండి యీకొలువు మానలేకుంటిని. అనాహారుడనయ్యు చావలేకపోతిని. ప్రత్యపకారప్రతీక్షచే మంత్రిత్వము మానుకొననైతిని. పండితోత్తమా! నాకు సాహాయ్య మొనర్పుము.

చాణ—ఏమీ? బ్రాహ్మణునియెడ నింత జుగుప్స గూర్చా?... ప్రేయసీ! నన్నింత తీవ్రదృష్టిని చూచుచుంటివి, ఏమి నీయాజ్ఞ?

కాత్యా—ఆర్యా! దయసేయుడు. లుప్తబ్రహ్మ తేజము నుద్ధరింతము. నేను మహారాజుగారి మంత్రినికదా! తాము వారిపురోహితులు గండు. ఇద్దరముకలిసి మనయెడ రాజుగారొనరించిన యత్యాచారమునకు దగిన వైరనిర్యాతన మొనర్తము. ఈభారతవర్షము హూఘమాయనంతవరకు బ్రాహ్మణుడు బ్రాహ్మణుడే. సోదరా! రండు.

చాణ—(చెవులు మూసికొని) మంచిది. నేను పౌరోహిత్యస్వీకరణము జేసితిని. మంత్రిసత్తమా! అదేకదా

నీయాజ్ఞ.., జరుగవలసినదంతయు నెరుగుదు. ఈబౌద్ధయుగ మవతరించినప్పటినుండియు బ్రాహ్మణులయందు వంచన, విశ్వాసఘాతుకత్వము, శాఠ్యమును సంక్రమించి సదాచారములు నమసినవి. కావున ప్రకృతమున బ్రాహ్మణుల గొంతుకలు నొక్కబడుచున్నవి. ఈబౌద్ధమత మహాప్రవాహము క్షణక్షణప్రవర్ధమాన మగుచున్నది. బ్రాహ్మణప్రభుత్వ మంతరించును. బ్రహ్మతేజ మారిపోవుటకు సిద్ధముగానున్నది. దానిని మనమురక్షింపజాలము, ఉద్ధరింపలేము. కాని ఆమహాప్రళయ మారంభింపకము న్నొకసారి ద్వాదశార్కు లుదయించినభాతి బ్రహ్మతేజమును బ్రకాశింపజేయుదము. నమువుము, నీవెనువెంటనే వచ్చెదను. (పోవుదురు)

---

మూడవ రంగము.

---

ఉద్యానవనము

నందుడు, సభ్యులు, గణికాజనము, నృత్తగీతము, దాసీజనము,

(చాణక్యునిప్రవేశము)

చాణ—మహారాజా!

1 సభ్యు—ఆ! ఎవరిది? దయ్యమా? భూతమా?

2 సభ్యు—ఓహో! చంద్రమండల మాకాశమునుండి యుట్టిపడినట్లున్నది.

1 సభ్యు—నీవెవడవు? నృత్యము సేయుదువా? పాడగలవా?

చాణ—నేను బ్రాహ్మణుడను.

1 సభ్యు—ఇచ్చట నేమియు దొరకదు పొమ్ము.

2 సభ్యు—బ్రాహ్మణులు వట్టిసోమరులు. స్త్రీలు, గోవులూ, బ్రాహ్మణులూ వీరితో మాటలాడకూడదు. పొమ్ము.

నందుడు—ఈసమయమున మాకడకు రాగతంబేమి?

చాణ—మీతండ్రిగారి యాబ్దికము జరిపింపవచ్చితిని, బిచ్చమెత్తుటకు రాలేదు.

నందు—తామిచటికి దయసేయవలయునని ప్రార్థించినవారెవరు?

చాణ—మీమంత్రి కాత్యాయనుడు.

నంద—మంత్రిగారాహ్వాన మొనర్చిన వారికడకు బొండు.

చాణ—మీస్యాలకుడు నన్నవమానించెను.

1 సభ్యు—ఆతనికింటబడిన నవమానము తప్పదు.

2 సభ్యు—బావమరుదు లందరూ అవమానింతురు. ఆతడు రాజస్యాలకు, డాతని మాటనెత్తకు. స్యాలకు డెన్ని కూనీల జేసినను శాసించుట వగదు.

చాణ—ఛీ! కుక్కా! నోరు మూసుకొనుము.

నందు—ఆతడవమానించిన బ్రభువుగారి కేమిలోటు వచ్చెనో? ఆతడు మగధసామ్రాజ్య ధురంధరులమగు మా బంధువని మరువగవా? (వాచాలుడు వచ్చును.)

వాచా-ఓరీ బ్రాహ్మణాధమా! నేనేమి సామాన్యుడనను

కొంటివా? నేను మగధసార్వభౌముని స్యాలకుడను, మహారాజుగారి తండ్రియు మాతండ్రియు వియ్యంకులు, మహారాజుగారిభార్య నాసోదరి, ప్రభువువారి తనయుడు నామేనల్లుడు. నేనేమి సామాన్యుడ ననకొంటివా? మూర్ఖా!

నందు—సౌమ్యుడనుండి: మేము బ్రాహ్మణుల కొండెముల వినుట కిట రాలేదు.

చాణ—రాజాధిరాజా! ఏమందువు? ఈనాటి బ్రాహ్మణు డానాటి బ్రాహ్మణుడా? అందువనే వానిసర్వస్వ మక్రమముగా వడిని వేసికొనుటజాలక గుడ్లెఱ్ఱజేసి సొమ్మను చుంటివి. నాకు కోపమువచ్చిన నీకు పోవునదేమి? ఆనాటి బ్రాహ్మణుడే యాకూరుణనేత్రంబుల వీక్షించెనా నీసామ్రాజ్యమును గోలుపోయి సింహాసనసమేతముగా భూకంపము సందువలె గ్రుంగియుందువు. జాగ్రత్త! ఋషులనాటి బ్రహ్మతేజము రిత్తవోయెనని తలపకుము.

వాచా—ఓహో! నీప్రతాపము జూపుటకుముందు రాజస్యాలకుడనగు నాపరితాప మింకొకసారి చవిజూచెదవా?

చాణ—చూచెద. మహారాజా! నాపరితాపమును చవిజూడవలెనన్నవీడు నాకొనర్చినయపచారమునకు తగిన ప్రతివిధాన మాచరింపవు.

నందు—ఓరీ! భిక్షుకా! ఇక్కడ నిలుచబడి యేల గుడ్లెర్రజేసెదవు? శీఘ్రమే యిటనుండి తొలగుము.

చాణ—బ్రాహ్మణులారా! ఇటువినుడు; ఇది కనుడు

1 సభ్యు—అత డిటనుండి పోయెనా? తిరుగ వచ్చునేమో?

2 సభ్యు—తద్దినమునా డింత యానందమెప్పుడును గలుగలేదు.

1 సభ్యు—ఇది యొకరకము తద్దినము.

వాచా—అదెట్లు?

1 సభ్యు—తద్దినములు మూడువిధములు:— తల్లి తండ్రి మొదలగువారి తద్దినము—వీటిని శ్రాద్ధము లందురు. పిల్లలతద్దినము, అదే వివాహము. రూపాయీలతద్దినము, దానికే దావా అని పేరు.

వాచా—మహాశయులారా?

1 సభ్యు—ఇప్పుడిక్కడ జరిగినదే. (నవ్వుదురు)

(మురా కాత్యాయనుల ప్రవేశము)

నందు—ఓహో! ఈమె నిక్కడికేల దెచ్చితివి?

కాత్యా—ప్రభువువా రాజ్ఞాపించలేదా? తక్షణమే మురను—

నంద—అట్లయిన నిక్కడకా తెచ్చితివి? ఇది మోదావహామైన యుద్యానము. ఇటనానందింపవలయు.

మురా—నాయనా! నీనోట నామాటవచ్చుటచే నాకు పరమానందము కల్గుచున్నది.

నంద—నిన్ను సంతసింపజేయుటకే సర్వకార్యముల జేయుదుననుకొంటివా? అందుకై నిన్నిట బిలిపింపలేదు. మంత్రీ! ఇచ్చోట రాచకార్యమా? నీవెంత యవివేకివి?

కాత్యా—ఆజ్ఞయైనచో నీమెను దిరుగ గొనిపోయెద.

1 సభ్యు—మంత్రీ! నీవట్లే చేసితివి.

2 సభ్యు—మిత్రమా! ఎట్లు?

1 సభ్యు—ఒకడు పెండ్లికి పల్లకినెక్కి ప్రయాణము ముగిసినతోడనే చేత నొక గుడ్డిగవ్వయైన తేకుండుట యెరిగి బోయీలతో "అయ్యలారా! నాయొద్ద ధనము లేదు, మీరు చాలబీదవారు, మిమ్మెట్లు చిన్నబుచ్చగలను? కావలయునన్న నన్నెటనుండి తెచ్చితిరో అక్కడ విడిచిపెట్టుడు. అందరముపో పుదము లెండు" అనెనట.

2 సభ్యు—ఇంకొకడు మఱియొక చిత్రము జేసెను. కూలివాండ్రచే నూయి త్రవ్వించి వారడిగినంత కూలినిచ్చుట కిష్టము లేక వారితో "మీరు త్రవ్వినగోతిని పూడ్చివేయుడు నేను మఱికొందరిచే త్రవ్వించుకొనెద" ననెను.

కాత్యా—ఈమెను బంపివత్తునా?

✓ నంద—పోనీ! తెచ్చితివికదా-మురా! నీకొడుకు చంద్ర గుప్తుడు సజీవుడై యున్నాడా?

ముర—జీవించి యున్నాడా! నాయనా, ఎక్కడ నున్నాడు?

నంద—ఆవిషయ మెరుగుటకే నిన్ను పిలిపించినది. వాడెక్కడనున్నాడో చెప్పుము.

ముర—నే నెరుగను, నాయనా!

నంద—నీకు తెలియును. ఎక్కడనున్నాఁడో చెప్పుము, లేకున్న నందు నెరుగుదువుగా ?

ముర—నిన్నెరుగనా? బాబూ! తొడపై బెంచి పెద్ద వాని జేసితిని, గుండెలమీఁద నుంచుకొని యాడించితిని.

నంద—నామాటయెట్టిదో యెరుగుదువా? చంద్ర గుప్తుఁ డెటనున్నాఁడో చెప్పుము.

ముర—నాయనా! యెరుగను.

నంద—శ్ ...నీకు తెలియును. చెప్పుము- లేకున్న—

ముర—నన్ను జంపెదవా? కానీ—చంపుము. ఇప్పుడు వలదు. చంపుటకుమున్ను నాకుమారుని చంద్రగుప్తు నొకసారి చూపుము. ఒక్కసారి చూపుము.

నంద—నిన్ను చంపను. ఇప్పుడే నిన్ను జంపిన నాపని జరుగదు. నిన్ను మరణము కారాగారమందుంచి క్షుధాగ్నిచే దగ్ధమగు నట్లొనరించెదను.

ముర—అక్కా! అంతినిష్ఠురముగ నొడిగట్టితివా? నేను నీకు దల్లిని కానా?

నంద—ఏమి! శూద్రస్త్రీవయ్యు నాకు తల్లివగుదువా? నాతండ్రి దాసివైన నీకు నాతల్లి యనిపించుకొనవలయునను దురాశ కలదా ?

ముర—అయ్యో!

1 సభ్యు—నాకొకసామెత జ్ఞప్తికివచ్చుచున్నది.

నంద—నోరుమూసికొనుము. మురా! నీకు మహారాజు తల్లివి కావలెనను దురాశగలదా? దాసి రాజమాత యగునా!

ముర—కాలేదు. నాకు మహారాజుతల్లిని కావలెనను కోర్కెలేదు. మహారాజా! నీవు చిరకాలము రాజవై యుండుము, నాచంద్రగుప్తుని బికారిగానైన నుంచుము. వాడు బ్రతికియుండిన జాలును. వానినొక్కసారి చూడవలెననియే నా కోర్కె. ఒక్కసారి గాఢాలింగనముజేసి గట్టిగా నేడువవలెనని యున్నది. నేను చంద్రగుప్తునితల్లిని, మహారాజుతల్లి నెట్లగుదు? నా కాయాశ లేదు.

నంద—చంద్రగుప్తు డెటనున్నాడో యిప్పుడైన జెప్పెదవా? నీవెరుగుదువు.

ముర—తెలిసియున్ననూ జెప్పెదననుకొంటివా? వెర్రివాడా! తల్లిప్రేమ నీవేమెరుగుదువు? నాప్రాణమును రక్షించుకొనుటకు నాకుమారుని పులివాత బడద్రోయుదునని యెంచితివా? మూఢుడా! మాతృదేవతామాహాత్మ్యమును కన్నతల్లి నెరుగని కట్టిడివి నీవెట్లెరుగగలవు?

నంద—చెప్పవా? సరే. అతడు నాశత్రువులలో జేరి నాకు ద్రోహము చేయనెంచి సేనగూర్చుచున్నాడట!

ముర—సర్వేశ్వరా! ఈమాటయే నిక్కువమైయా సేనమూలమున చంద్రగుప్తుడు తనతల్లికి జరిగిన యవమానమునకు దగినప్రతీకారము చేయుగాక.

నంద—అబ్బా! ఏంతకోర్కె గలదు! దీని జెరలో ద్రోయుడు.

వాచా—(జుట్టుపట్టి గెంటుచు) నడువుము. (అందరు నవ్వుదురు)

మురా—నీకన్నులు చల్లనాయెనా? ఇంతకు దెచ్చితివా నందమహారాజా? నీకుతల్లి నెట్లగుదు? నీకు నేను పాలీయలేదు. ఎవతెయో రాక్షసి రక్తమును గుడిపియుండును. రాజమాత లిట్టి యగచాట్లను భంగపాటును బడుచుండ జూచిననన్ను జన్మ జన్మములయందునూ రాజమాతను జేయకుండుటకు బరమేశ్వరుని సర్వదా ప్రార్థించుచుందును.

1 సభ్యు—బలే-బాగుగ జెప్పినది.

మురా—నందమహారాజా! నీకు నేదల్లినిగాను. ఐనను దీనురాల, నబలను, అసహాయను; ఉవిద నిట్లవమానింతువా? నీ వాడుదానికి బుట్టలేదా? కన్నతల్లి నిట్లుచేయుదువా? అనదలయెడ నత్యాచారమా? స్త్రీనగుట నే సహించియుంటిగాని ధర్మదేవత సహించునా? ఈదారాత్మ్యమునకు దగినఫలమనుభవింపకపోవు, ఇట్టిపాపము కట్టికుడుపదా ?

వాచా—నడువుము. నీధర్మోపన్యాస మిక జాలు. నోరు మూసుకొనుము.

నంద—ఇప్పుడైన చంద్రగుప్తు నిక్కడ నప్పగించిన ... నిన్ను విడిచెద-లేనిచో—

(కత్తిదూసికొని చంద్రగుప్తుడు ప్రవేశించును)

చ॥గు—ఓరీ! అధమాధమా! చంద్రగుప్తుడు నీయెదుటనే యున్నాడురా! (వాచాలుని దన్నిద్రోసి) అమ్మా! నీకెట్టి యవమానము ఘటిల్లె! చంద్రగుప్తునిబొందిలో జీవముండ నీకిట్టియవస్థ ప్రాప్తించెనా? అమ్మా! అమ్మా!

మురా—నాయనా, వచ్చితివా? (కౌగిలించియేడ్చును)

చ॥గు—ఓరీ పిరికిపందా! ఆడవారిపై నత్యాచారమునకొడిగట్టితివా? దీనికితగిన ఫలమనుభవింతువులే. స్వస్తయుండుచుకొనుము. అమ్మా! రమ్మా (పోవును)

---

నాల్గవరంగము

---

చంద్రకేతు నాస్థానము.

(చంద్రగుప్త చంద్రకేతులు)

చ॥ కే—నారాజ్యమును నీరాజ్యముగ భావింపుము, నేను నీకువశవర్తినగు సోదరుడ ననుకొనుము, నన్ను విశ్వసింపుము; నాపార్వత్యసేనయంతయు నీయిచ్చవచ్చినరీతి నుపయోగించుకొనుము; వారునీకై ప్రాణములనుసైతము ధారవోయుదురు.

చ॥గు—మిత్రమా! అశిక్షితమైన నీసేనను యవనవాహినీపథానుసారముశిక్షితమొనర్చి,వీరిసహజసాహసమును

విజ్ఞానమును కారాగారమున కరిగించి, పోతఁబోసి, సానబెట్టి మెరుగుదెచ్చి, యీమగధరాజ్యమననేల, చతుస్సముద్రముద్రితంబగు ధరామండలమునెల్ల జయింపఁజాలుసామర్థ్యము వీరి కలవడఁజేయుదును.

చ॥ కే.—నందునిమంత్రి శాకతాలుఁడు గొప్పకూట నీతిజ్ఞుఁడని విందును. అతఁడు బహుబుద్ధిశాలియఁట.

చా॥ గు.—అది నేనెరుఁగుదును. నాపక్షమునను నందుని పూర్వమంత్రియగు కాత్యాయనుఁడున్నాఁడు. ఆతఁడు శాకతాలునకు దగిన యుద్ధి-మఱియు నతికుశలుఁడు, బంధితుఁడునగు చాణక్యుని గొనిరమ్మని కాత్యాయను నంపితిని.

చ॥ కే.—చాణక్యుఁడెవఁడు?

చా॥ గు.—నీవెఱుఁగవు. ఆతఁడతిబుద్ధిమంతుఁడు, ఏకనిష్ఠాపరుఁడు, విచక్షణుఁడు. నందునిపై నాతని కోపము చిరకాలము నుండియు రగులుచున్నది. ఇప్పు డాతఁడు వాయుభక్షుఁడై యుంటచే నాతని యాగ్రహాగ్ని భగ్గుమనుచున్నది. పగసాధించుటలో బరశురాముఁడైన నతనికి జఘన్యుఁడే. అతఁడు మాంత్రికుఁడు, తాంత్రికుఁడు, కుత్సితములకు కుతంత్రములకునూ పెట్టినపేరు. అసమానరాజనీతిజ్ఞుఁడు, అశేషశేముషీయుతుఁడు.

చ॥ కే.—అట్టిమహిమ గలవాఁడా?

చా॥ గు.—సందియమేల? అపరవిశ్వామిత్రుఁడు. పంచభూతములాయనకు వశవర్తులు, అవి వానితో ప్రత్యక్షముగా సంభాషించును. ఆతనికి గోపమువచ్చెనా పచ్చనిగడ్డియూ

భగ్గునమండును. అతడే కాక, ఈప్రపంచమున నతనికిముందు వెనుకల నెవ్వరును లేరు.

చ॥ కే—అట్టి పురుషుడు భయానకుడు గాడా?

చ॥గు—ఈసమయమున నట్టివాడే మనకు కావల యును. చంద్రకేతూ! నీయందు నాయాశలన్నియు నిక్షిప్తము జేయవచ్చునా?

చ॥ కే—మిత్రమా! నిన్నెపుడు మగధసార్వభౌమా యనిపిలుతునని యువ్విళ్ళూరుచుండునన్ను నమ్ముటకుసంకోచిం చుచుంటివా? నా రాజభక్తి నీవెరుగవా? నిన్ను సోదరా యని కౌగిలించుటయేని జ్ఞప్తికి రాలేదా? నీకష్టముల జూచిన నిర్జీవ పదార్థములు సైతము ప్రతీకారము జేయ నపేక్షించుచుండ మిత్రుడను రాజనైన నాకు క్రోధముజనింపదా? న్యాయపక్ష పాతినగు నేను నీకు నాసర్వస్వమును ధారవోయుచున్నను నాయాందింత యపనమ్మకము కల్గుటకు హేతువేమి?

చ॥గు—సోదరా! నాకిప్పటికి దీర్ఘచింత దీరెను.

(తెరలో చంద్రగుప్తా!)

అమ్మా! ఇదే వచ్చుచున్నాను. చంద్రకేతూ! మా యమ్మ కభివాదనముచేసి యాశీర్వాదము గొందము, గమ్మ పోవుదము.

ఛాయ—ఈతడిందుడో? ఉపేంద్రుడో? ఈతని దర్శించుటచే బూర్ణచంద్రుని గాంచినరీతి నాకన్నులుచల్ల

బడుచున్నవి. ఈతనిస్వరము భేరీరవమువోలె గంభీరముగా నున్నది. మాయన్న సీత నాలింగనము చేయుతరి పాత్ర్వ్యణ్మేఘ శకలమును సూర్యకాంతి యావరించినట్లుండెను. అతను విసరున బోగా మలయానిలమువీచె; గాలిపోయెను కాని సౌరభము పీడుటలేదు. (పోవును)

(చంద్రగుప్తుడు మురయు వత్తురు)

చ॥గు—అమ్మా! మనకు జరిగిన అన్యాయమునకు ప్రతీకారము సేయుటకు మగధనుండి యింతదూరము వచ్చితిమి. అవమాన వహ్ని నాహృదయకుహరమున ప్రజ్వరిల్లు చున్నది. అందు నీయవమానాజ్యమును వేల్చితిని. ఇంతకుబూర్వము నిసర్గస్నేహదోషమున నందుని సోదరునిగా భావించి క్షమించునిచ్ఛ యుండెను, కాని నేటినుండి యావిచారమును నాహృదయమునుండి వెడలనడిపితిని. నాస్నేహబిందువులు నీకతమున విస్ఫులింగనివహంబులుగ మారినవి.

మురా—నాయనా! ఎప్పుడుద్యానవనమున నందుడు నన్ను "శూద్రస్త్రీ రాజమాత యగునా?" అని గద్దించెనో, నాడే తప్తవహ్నిశిఖలనడుమ నున్నటుల భావించితిని; పిమ్మట వాని యాజ్ఞచే నాదురాత్ముడు వాచాలుడు నాకొప్పుపట్టి యీడ్చి ----(ఏడ్చును)

చ॥గు—అమ్మా! ఊరడిల్లుము. జయము పొందగలనో, పొందలేనో అను సందియము ఇదివరకుండెను కాని, అదినేడు విచ్ఛిన్నమైనది, రాక్షసలోకపీడిత సీతాశ్రుప్రవాహమున లంక

మున్గెను, ద్రౌపదీకేశాంబరాకర్షణజనితభీమానలమున కురుకులము భస్మమాయెను. స్త్రీలయెడ నపచార మొనర్చిన జాతులు సమూలము నశించును. ఈనందవంశము మాత్ర ముట్టిపడినదా? ఇది నశించుటకు నెంతయో కాలము పట్టదు. సందియము లేదు. మనకు వారొనరించిన దౌరాత్మ్యమునకు దగినశాస్తి చేయగలను. విచారింపకుము.

ముర—ఆయాశయే నాకు జీవహేతువు. (పోవును)

చ॥గు—శూద్రస్త్రీయా! శూద్రులు మనుష్యులు కారా? క్షత్రియులకు బోలె వారికి కాలుసేతులు లేవా! మెదడు లేదా? హృదయముండదా? ఇంతటి యవజ్ఞయా? మంచిది చూచెదగాక. ఒకసారి శూద్రుని శక్తిజూపెద. శూద్రుడు మానవుడగునో కాడో తెల్పెద. శూద్రుడు రాజుకాగూడదా? రాజనామమునకు క్షత్రియుడే యర్హుడా?

సికందరుసార్వభౌమా! నీభవిష్యద్వాణిని సఫలీకృత మొనర్చుటయే నాజీవితమునకు పరమావధి. లక్ష్యము నాకదే.

(కాత్యాయనుడు వచ్చును.)

చ॥గు—ఎవరక్కడ?

కాత్యా—నేను కాత్యాయనుడను.

చ॥గు—చాణక్యపండితు డెక్కడ?

కాత్యా—పూజ ముగించి యింతలో వచ్చును.

చ॥గు—ఆతడెట్లు కాన్పించెను? ఏమి విశేషములు?

కాత్యా——ఆతడు మథించుచుండిన క్షీరసముద్రము భాతియుండెను. హాలాహలమే పుట్టునో, లేక యమృతమే వెలువడునో తెలియదు. ఇంతకూ ఆతనిచర్యలు నిర్మాణ నైపుణియు మాదృశులకు దురవగాహ్యములు.

చ॥ గు——ఏల?

కాత్యా——మనవృత్తాంతము నివేదించినతోడనే గంభీరమగు నాతనిముఖ ముదితసూర్యునిభాతి కాంతిప్రదమై తత్క్షణమే అస్తమితార్కునివోలె మ్లానమయ్యెను. క్షీణమగునాతనిదేహము వాతాహతదీపశిఖలాగున ప్రకంపితమై తోడనే నిశ్చల మయ్యెను. అధరద్వయము పై స్వంగ్యహాసము క్షణమాత్ర ముల్లలనాడి వెంటనే లుప్తమయ్యెను. కనిజూడ నేదేని యద్భుతమూర్తి యాతనినోరు కట్టినట్లు తోచెను. ముఖమంతయు వెల్లబారి నుదుట దీర్ఘచింతారేఖ లుత్పన్నములాయెను. రెండుకంటిపాపలను దూరస్థమగునొక శూన్యప్రదేశమున లగ్నముజేసితివ్రదృష్టులనాతడు జూచుచు నిలుచుండెను.

చ॥గు——చిత్రముగానున్నది, ఎప్పుడువచ్చునో తెలియదా?

కాత్యా——అదే వచ్చినట్లున్నది.

చ॥గు——వారెవరు?

కాత్య——చాణక్యపండితులే! (చాణక్యుడువచ్చి చంద్రగుప్తుని తేరిజూచి)

చాణ——నీవా చంద్రగుప్తుడవు?

చ॥గు—ఔను-మహాత్మా! అభివాదనము, భవద్దాసుడను.

చాణ.—సమర్థుడవే.

చ॥గు—మీరు కటాక్షించిన—

చాణ—నేనెవడను? అనాముకుడ- నీవొకడవే చేయగలవు. నాజోలియేల? నేనుడను—బ్రాహ్మణుడను—అతిదీనుడను.

చ॥గు—మహాత్మా! బ్రాహ్మణుడు దీనుడా?

చాణ—ప్రకృతమున బ్రాహ్మణుని కన్న దీనతరుడెవడు? బ్రాహ్మణశాపమున వంశములు భస్మములగుచున్నవా? దీపము పెట్టుకొనుటకు వానికి దిక్కులేదు. వాని యుపవీతము నేడు భిక్షుకమాత్రసంజ్ఞయైనది. నేటి క్షత్రియులు వాని పీచమడచుచున్నారు. బ్రాహ్మణు లప్పుడప్పుడు సముద్రతరంగములభంగి పొర్లుచుండినను తుదకు తటముపై బడి విచ్ఛిన్నులై ప్రాణములబాసి నిర్వృతించెందుచున్నారు. సారము హీనమయ్యె, శక్తిశూన్యమయ్యె.

చ॥గు—మహాత్మా! అట్లు సెలవిచ్చెదరేల? చాణక్య పండితులు—

చాణ—ఆ!విచక్షణుడు, విద్వాంసుడు, కూటనీతిజ్ఞుడని నీవువిన్నది నిజము. కాని యాతనికి హృదయము లేదని నీవు వినలేదుకాబోలు (చ॥గు॥ని హస్తంబునుబట్టి) హృదయమున చేయివేసిచూడుము. అం దేమున్నది?

చం॥గు॥—క్షీణభాగమున రక్తము ప్రవహించుచున్నది.

చాణ—ప్రవాహము?

చం॥గు॥రక్త ప్రవాహము.

చాణ—మూఢుడా? అది రక్తమా? కాదు కాదు శత్రు దేహమున రక్తమెక్కడిది? అది హిమానీప్రవాహము. శత్రు రక్తమంతయు గడ్డకట్టినది.

చం॥గు॥—గురుదేవా! నేనంతయు నెఱిఁగితి. నాకు మీరాజ్ఞ నొసంగినజాలు; నన్నాకర్షించి వదలుడు. "చంద్రగుప్తా! నీవుముందు నిలువు"మన్నజాలును, యవనసైన్యములను నుక్కుబెట్టెదను.

చాణ—చేయగలవా?

చం.గు—నిశ్చయముగా! మహాత్ముఁడగు సికందరుసార్వభౌముడు మున్నొకనాడు "నీవు దిగ్విజయుడవు కాఁగలవు" అని పల్కెను. ఆపల్కు సర్వకాల సర్వావస్థలయందును నా చెవిలో ఘంటవలె మ్రోగుచున్నది. ఆమహాత్ముని భవిష్యద్వాక్కు తోడు మీయాశీర్వచన బలముండిన ఎట్టి దుర్ఘటమైన పని నైన నిర్వహింపఁగలను. నే నుపక్రమింపఁబోవు మహాయజ్ఞమునకు మీరుపద్రష్టపదమును స్వీకరించి నాహస్తమున దీక్షాసూత్రము గట్టుడు.

చాణ—ప్రాణేశ్వరీ! నీయాజ్ఞయేమి? నీకు సమ్మతమేనా?—ఇంక కొదువయేమి! చంద్రగుప్తా! నా యాజ్ఞనుల్లంఘింపనని నాపదములంటి ప్రమాణము సేయుము.

చ॥గు॥—(పాదములంటి) మహాత్మా! ఇదే ప్రమాణము సేయుచున్నాను, మీ మాన జనదాటను. నాకు రక్షా బంధనముచేసి దీక్షలో ప్రవేశపెట్టుడు.

చాణ—నీవు సమర్థుడవే, ఆవిషయము నీముఖము, దృష్టి, భావభంగియు నేకకంఠ్యముగ నొక్క నక్కాణించుచున్నవి. ఇదిగో నిన్ను దీక్షితుని జేయుచున్నాను—నిన్ను మగధసింహాసనమున నాసీనుంజేసి భారతవర్షమున కధీశ్వరుని జేసెదను. సార్వభౌముడ వయ్యెదవు. ఇంధనముల జాగ్రత్త సేయుము. వాటితో బ్రహ్మతేజమును బ్రజ్వరిల్ల జేసెద, ఆయగ్ని దావానలములీల వ్యాప్తమై బడబానలము భాతి భారతవర్షమందలి జలమునంతయు శోషింపజేయును. చంద్రగుప్తా! తలయెత్తి పైకి జూడుము-ఏమున్నది?

చ॥గు—ఆకాశము.

చాణ—దానివర్ణము?

చ॥గు—అదిరక్తవర్ణముచేతను, పీతవర్ణముచేతను శబలితమైయున్నది.

చాణ—దానిబట్టి నీకేమి ద్యోతకమగుచున్నది?

చ॥గు—తుపాను రానున్నది.

చాణ—చక్కగా గ్రహించితివి. భవిష్యత్తెట్లు కాన్పించుచున్నది?

చ॥గు—నాకెద్దియు తోపలేదు.

చాణ—ఓయీ! నీవు గుడ్డివాడవు. అచ్చటగూడ తుపాను రాగలదు. అది కపిలునిశాపమువలన గాదు, విశ్వామిత్రుని

తపోబలమున గాదు, పరశురాముని పరాక్రమముచే గాదు, వామనుని ఛలముచే గాదు- ఈబ్రాహ్మణునిబుద్ధి, యీశూద్రునినిష్ఠ, ఈబ్రాహ్మణుని ప్రతీకారము ఈశూద్రుని ప్రతిహింసయూ దీనికి ముఖ్యకారణములు. బ్రాహ్మణుని ప్రతిభ, శూద్రుని పటిమ- వీటి సమావేశముచే స్వర్గమర్త్యలోకములకు సమాగమము కలుగనున్నది. చంద్రగుప్తా! ఇక జెరవేల? నీముఖమున నాకేమి కనబడుచున్నదో యెరుగుదువా?

చ॥గు—గురుదేవా! నేనెరుగను.

చాణ—ప్రధూమిత ప్రజ్వలిత ప్రవహిత రక్తస్రోతస్వతియై, భైరవబీభత్సాకారము ధరియించిన ఈభరతవర్షమునకు మారుగా రత్నాలంకార పుష్పోజ్వలసంగీతముఖర హాసమయియగు భారతమాత దివ్యమంగళమూర్తియై, గగనాయతమగు నీముఖమున తాండవమాడుచున్నది; రత్నాకరము మొదలు మహోదధివరకు వ్యాప్తమగు సామ్రాజ్య ముత్పన్నము కానున్నది, దానికి బ్రతిష్ఠాతవు సార్వభౌమముద్రముద్రితుండవగు నీవు, నీకు బురోహితుడు దీనుడు దరిద్రుడూ బ్రాహ్మణుడునగు చాణక్యుడు.






## రెండవ అంకము.

### మొదటి రంగము

### సెల్యూకసు గృహము.

సెల్యూ—తనయా! వీరాగ్రేసరుడగు సికందరుషా స్వర్గముజేరెను.

హెలెన్—అయ్యో! ఎట్లు తెలిసె?

సెల్యూ-సూర్యుడస్తమింప ప్రపంచ మెరుగకుండునా?

హెలె—తరువాత?

సెల్యూ—అనంతరము జరుగుట కేమున్నది? వారే నన్నీ ప్రాచ్యసామ్రాజ్యమున కుత్తరాధికారిగా నియమించి చనిరికదా?

హెలె—అతడు మహాకాంక్షాప్రేరితుడై యీయర్ధ ఖండమును జయించెను, కాని పాపము నిజదేశమున మరణించుటకైన నోచుకొనలేదు.

సెల్యూ—ఆ సార్వభౌము డసంపూర్ణముగ విడిచిన కార్యమును నేను నిశ్శేషముచేసెద.

హెలె—దేనిని?

సెల్యూ—భారతవర్ష జిగీషను.

హెలె—తత్ఫలము?

సెల్యూ—కీర్తి!

హెలె—కాదు. అపకీర్తి! పురుషుని యాశాపాశమున కంతములేదు. సాగరమేఖలాయుత మేదినీవలయసామ్రాజ్యము చేకూరి సర్వవస్తుపూర్ణైశ్వర్యమున దులదూగుచున్ననూ వానిదాహము తీరదు. పురుషుని హింసాప్రవృత్తియు నట్టిదే. ఘాతుకమృగమువలె గంటబడినజంతువునెల్ల గ్రసియింపజూచును. ఇందొకవిశేషముకలదు,- ఇతరజంతుభక్షణమే చేయునుగాని నరమాంస మేల తినడో? తండ్రీ! అది ఖాద్యము కాకుండుటచేతనా?

సెల్యూ—అట్టియాచారము లేదు.

హెలె—అంతేనా? ఆయాచారమును నీవేల స్థాపింపరాదు? ఆచంద్రార్కమూ నీపేరు ప్రపంచస్థాయిగానుండునే! ఆహా! పురుషుల కెంతరక్తపిపాస! మీహృదయముల వేరొక ప్రవృత్తియే యుండదుకాబోలు?

సెల్యూ—ఏట్టిప్రవృత్తి?

హెలె—ఆర్తుల దుఃఖనివారణము, క్షుధార్తుల కన్నదానము, అజ్ఞానులకు జ్ఞానోపదేశము, ఇట్టిమహాత్సంకల్పములెవ్వియు నుండవా? కేవల స్వార్థప్రసారమూ, దుఃఖవృద్ధీ, అత్యాచారమూ, పరపీడనమునా?

సెల్యూ—విజిగీష మానవులకు మహత్ప్రవృత్తియని డెమోస్తెనీసు చెప్పెను.

హెలె—అట్లాతడెక్కడను జెప్పియుండలేదు. ఆతని గ్రంథములు తీసికొనివత్తునా?

సెల్యూ—వలదు. వలదు. నీ వాతని గ్రంథములనన్ని
టిని చదివితివా ?

హెలె—ఆహా ! చదివితిని.

సెల్యూ—నీవింత గాఢముగా గ్రంథపఠనమేల జేయు
దువు ? చదువగా చదువగా బుద్ధిసన్నగిల్లును. మాలికత్వము
నశించును.

హెలె—చదివిన మాలికత్వము నశించునా? చదువ
కున్న అది సిద్ధించునా ? అట్లైన మాలిక శ్రేష్ఠము గాడిదె
కావలయు.

సెల్యూ—ఏల ?

హెలె—అది బొత్తిగా జదువలేదు.

సెల్యూ—కుమారీ ! నన్నవమానింతువా ?

హెలె—లేదులేదు. నిన్ను నే నవమానింతునా?

సెల్యూ—నన్ను గాడిదెతో పోల్చుటలేదా ?

హెలె—నే నట్లంటినా ?

సెల్యూ—మరి నీయర్థమేమి ?

హెలె—అట్లైన నపరాధము జేసితిని, క్షమింపుము.

సెల్యూ—నేను క్షమింపను. నన్నెంత యవమానిం
చితివి! నాకు కోపమువచ్చినది.

హెలె—తండ్రీ ! నాతప్పు సైరింపుము. (చేతులుపట్టు
కొనును)

సెల్యూ-పొమ్మమ్మ! నేను క్షమింపను. (విడిపించుకొనును)

హెలె—తండ్రీ! ఎక్కడకు బోవుదు? నీవే నాదిక్కు.

సెల్యూ-అమ్మా! లెమ్ము. నేరము నీదికాదు, అపరాధిని నేను, కోపోద్రేకమున నిన్ను దూలనాడితిని. నీయెడ నింతకాఠిన్యము వహింపగలనని యెప్పుడు ననుకొనలేదు. లెమ్ము. నాతప్పు సైరింపుము.

హెలె—తండ్రీ! యింతమాటాడితివి! నీతప్పు నేను సైరించు నంతదాననా?

సెల్యూ—అమ్మా! క్రోధావేశమున నోడలెరుంగనైతిని—తల్లిలేని పిల్లవు—ఎంత కఠినుడ!

హెలె—నాకు తల్లిలేకేమి? నాకు దండ్రివైన నీవే తల్లివైన నీవే, లేకున్న నాయెడ నింతచనవుతో మెలగ గలనా?

సెల్యూ—నాయెడ నీకు చనవేలేదు. నన్నెప్పుడు నేదియు నడుగవు.

హెలె—అడుగకుండగ నన్నియు సమకూర్చుచుంటివి కావున నేనేమి యడుగవలయు? నాయొద్ద లేనిదేది?

సెల్యూ—నీయొద్ద నమూల్యములగు నాభరణములు కాని యంబరములుకాని లేవే?

హెలె—అన్నియూ కలవు. నాకెందును లోపము లేదు.

సెల్యూ—ఉండిన ధరింపవేమి?

హెలె—ధరించిన నీకు సంతసమగునా? ఐనచో ధరించెదను.

సెల్యూ——తప్పక ధరింపుము. నేను సైన్యాధ్యక్షుని శిబిరమున కేగి వచ్చెద. నీవు పోయి శయనింపుము.

హెలె——అట్లే చేసెదను.

సెల్యూ——అమ్మా! చూడు. నీవు రాత్రులు చాలా సేపువరకు చదువుచుందువు, అట్లు చేయుటచే నీలావణ్యము తగ్గును, అంత చదువకుము, శీఘ్రమే శయనింపుచుండుము.

హెలె——అట్లే చేయుచుందును, మాళికత్వము సిద్ధించునా? (సెల్యూ పోవును)

(హెలెన్ పుస్తకము జదివి క్రిందనుంచి)

సూర్యు డస్తమించుచున్నాడు. సింధునదీతీరమున నాటిసాయంసమయశోభ జ్ఞప్తికి వచ్చుచున్నది. రవికరోజ్వల భారతవర్షమెక్కడ? కందరావృతమగు గాంధారమెక్కడ? ఆతడు మగధరాజకుమారుడు. నేను సంస్కృతము నభ్యసింతును; ఆభాష భావగరిమ, కవిత్వము, జ్ఞానము మొదలగు వానికి గనియట. ఎవరక్కడ? ఏంటిగోనసా?

(ఆతడు వచ్చును.)

ఏంటి——హెలెన్, నేనే.

హెలె——(లేచి) తండ్రిగా రిచట లేరు.

ఏంటి——అది యెరిగియే వచ్చితిని.

హె——నేనొంటరిగా నున్నప్పుడు నీవాకస్మికముగా రానేల?

ఏంటి——నారాక నీకు బీతిప్రదాయకము గాదా?

హేలె—నే నట్లంటినా ?

ఏంటి—ఏమి స్త్రీజాతి కాపట్యము? ఇంతవరకు నీ మనసులోని మాట నెరుగలేకున్నాను ? "నేనట్లంటినా ?" ఏమియు త్తరమిది? నీవట్లనలేదు, నిక్కమే. నేనిట వచ్చుట నీ కిష్టమూ, కష్టమూ? దీనికి ప్రత్యుత్తర మిచ్చిన నీకునష్టమేమి ?

హేలె—ప్రత్యుత్తర మిచ్చిన లాభమేమి ?

ఏంటి—ఇచ్చుటవలన నీకు లాభము లేదేమో, కాని దానిని వినుటవలన నాకు లాభమున్నది.

హేలె—ఎట్టి లాభము ?

ఏంటి—ఈప్రశ్నకు నీవిచ్చెడు నుత్తరము నాభవిష్యత్తునకు మూలమంత్రము- కాంతామణీ, ఇటు వినుము. నిన్న కడసారి ప్రార్థించుట కిట వచ్చితి.

హేలె—ఏమని ?

ఏంటి—కన్నులశ్రుపూరితములై యుండ శిరమువంచి యాచించితిని, కాని దొరికినది కాదు; క్రోధకంపిత స్వరమున నడిగితిని, లభింపదాయె; నేడు సహజసరళములగు పల్కులతో జిజ్ఞాసువునై యిట వచ్చితిని. నామనమును క్రోధముగాని సంతోషముగాని ఆవరింపలేదు. నీవు నన్ను వివాహమాడెదవో లేదో తెల్పెదవా ?

హేలె—నాతండ్రిపై గత్తినెత్తినవాని పెండ్లియాడ నుద్యమింతునా ?

ఏంటి—అదేటిమాట ? దానికి గారణభూతురాలవు నీవే. తత్పూర్వము ప్రసంగవశమున నిన్నడుగ "నాతండ్రికేది యిష్టమో, నాకదియ యిష్టము"ని నీవు చెప్పలేదా ? పిమ్మట నేనతని నడుగ "నీజనకు డెవరో నిశ్చయము కాకమున్న నాకూతురు నిన్ను పెండ్లి యాడుట అసంభవము"ని వ్యంగ్యముగా నాత డుత్తరమిచ్చెను.

హెలెను—ఔను. అతడు సర్వసేనాధిపతి నీవు సామాన్య సైన్యాధ్యక్షుడవు. మీయిద్దర కెంత తారతమ్యమున్నది ?

ఏంటి—అందుకు గాదు. అతడు నా యజ్ఞాతజన్మ వృత్తాంతము నెత్తిపొడిచెను. అందుచే క్రోధోద్దీపితుడనై యొడలు మరచి యాతనిపై గత్తినెత్తితిని. హెలెన్, నాతప్పు సైరింపుము.

హెలె—తప్పు సైరించుట నాకు సమ్మతమే కాని నిన్ను వివాహమాడ జాలను.

ఏంటి—ఏల ?

హెలె—రాజకన్య తనమతామతములకై తనప్రజలలో నొకనికి తగిన సమాధాన మీయ నవసరము లేదు.

ఏంటి—అబ్బా ! ఏమిగర్వోక్తి !

హెలె—అట్లైన నేనామాట నవలేదు, నీవు వినలేదనుకొనుము. అవివాహితయగు నబలకు తన వివాహవిషయమున నిష్టానిష్టముల కారణముల జెప్పవలసిన బాధ్యత లేదు.

ఏంటి—నాకు గారణము చెప్పనక్కరలేదు. నాకు గావలసినది యు త్తరము. నీవు నన్ను బెండ్లియాడెదవా, లేదా?

హెలె—ఆ? ఇంతలోనే నూతాౌరుణనేత్రోడ నయ్యే దేల?

ఏంటి—ఉ త్తర మిమ్ము. పెండ్లియాడెదవా, లేదా?

(చేయిపట్టుకొనును)

హెలె—ఏంటిగోనస్, కాపురుషుడ వైతివా? చేయి వదలుము, యవనుడవో?

ఏంటి—యవనుడను ప్రేమికుడనూ కావుననే యింత పట్టు సాహసించితిని. సహజసుకరళమగు నుత్తరమిమ్ము. పెండ్లి యాడెదవా, లేదా?

హెలె—నిన్ను వివాహమాడుటకన్న దుర్గంధగళిత కుష్ఠురోగినైన బెండ్లియాడుటకు సిద్ధురాలనని నమ్ముము- అధముడా! ఇచ్చటనుండి పొమ్ము.

ఏంటి—సరే-పోవుచున్నాడను. హెలెన్, ఒక్కమాట.

హె—రాకుమారీ యనుము. నానామ ముచ్చరించు టకు నీకధికారము లేదు. సామాన్య సైనికుడవు- పురుగును బోలె కాలితో నలిపివేయ గలను, లేదా, పొమ్మని విడిచి పెట్టగలను. కిటప్రాయుడ వాసియూసార్వభౌముని ముద్దుల బిడ్డ చేతిని ముట్టెదవా? కన్ను మిన్ను గానక యున్నావు, ఇట్టి యాగడమా?

ఏంటి—ఇందుకు సమాధానము కొలది దినములలో నిచ్చెద- కాలచక్రము మారదా? ఏనాటికైన భాగ్యచక్రము నావైపు తిరుగునో లేదో చూచెద.

(వెళ్లబోవ సెల్యూకసెదురై)

సెల్యూ—మరల నాకూతురితో నేకాంత మాడ వచ్చితివా?

హెలె—తండ్రీ! నాశరీరమునంట సాహసించిన వాడు నీకు సైన్యాధ్యక్షుడై యుండఁ జెల్లునా?

సెల్యూ—ఏంటియోకస్!

ఏంటి—నే నామెనంటుట నిక్కము. తప్పైన శిక్షింపుము.

సెల్యూ—సికందరుషా వారి యాజ్ఞానుసారము నిన్ను గెంటివేయవలసినది. అందుకు మారుగ నా సేనాధ్యక్షునిగ నియమించితిని. దాని కిదియా ప్రతీకారము? ఎవరక్కడ?

(ఇద్దరు భటులు వత్తురు.)

వీని జెరలో ద్రోయుడు. మూర్ఖుడా! నీకు శిక్ష మరణమే. ఓయీ, వీని వధ్యస్థానమున కీక్షణము గొనిపొండు.

హెలె—వద్దు, వద్దు. తండ్రీ! ఈసారి వీని విడుము.

సెల్యూ—అట్లుకాదు. వీని కింత పొగరా!

హెలె—ఉద్యోగమునుండి తొలగింపుము.

సెల్యూ—ఆశిక్ష చాలదు.

హెలె—మన రాజ్యమునుండి పారదోలుము, ఉరి తీయవలదు.

సెల్యూ—అమ్మా! వీని నీవెరుగవు, వీని జంపక మానను.

హెలె—ఇతడు వీరుడు, తప్పు తనదని యొప్పుకొనుచున్నాడు, ఇది కడసారిగా భావించి క్షమించి నిర్వాసితుని జేయుము.

ఏంటి—క్షమింపుమని నేను వేడికొనను. అయ్యా, నేనపరాధ మొనర్చితిని. నీయిచ్చవచ్చిన ట్లొనరింపుము.

హెలె—తండ్రీ, వీని జంపవలదని నేను ప్రార్థించుచుంటిని, నాకోర్కె నిమ్ము.

సెల్యూ—సరే. ఈయపరాధమును మన్నించితిని, నా రాజ్యము నుంచి పొమ్ము. తిరుగి వెన్నడేని నా రాష్ట్రమున గాలువెట్టితివా నీకు మరణము తప్పదు (ఆతడు పోవును.)

హెలె—తండ్రీ! నీవు వీని విముక్తునిగ నొనరుము.

సెల్యూ—అమ్మా! నీవు చేతులు జోడించితివా నా యుక్తులన్నియు పరాజితములగును. లేక లేక కలిగిన మదేక పుత్రికవు. కావున నీకు నాపై సర్వాధికారము గలదు.

హెలె—ఈవిషయమును తెమిస్టాక్లె నేమన్నాడు?

సెల్యూ—ఏమీ అనలేదు. నీ వసాధ్యురాల వగుచున్నావు. (పోవును)

హెలె—తండ్రీ నీ కేది యిష్టమో అదియే నాకిష్టము.

నీకు నాయందుగల యగాధప్రేమకు ప్రతిగా నేనేమీయ గలను? అనురక్తనయ్యు నీయెడ నపచార మొనర్చిన యంటిదోషకసును వివాహమాడను.

---

గంభీరరంగము

---

(శిబిరమున మురాచాణక్యులు)

ముర—గురువరా! రేపు యుద్ధము కాబోలు?

చాణ—ఆహా! రేపే యుద్ధము.

ముర—చంద్రగుప్తుడు జయించునా?

చాణ—తప్పదు-మురా, అనుదినమూ నీతో వేయి సారులు చెప్పుచుంటిని. ఈయుద్ధనిశీథమున దీని నడుగుటకే వచ్చితివా?

ముర—గురూత్తమా! ఆందోళన ముండబట్టదు .. యుద్ధమేల? మానరాదా?... యుద్ధ మాపరాదా?

చాణ—మురా? ఏమంటివి?

✓ ముర—గురువరా! చంద్రగుప్తుడు నేగన్న కొడుకు, నందుడు నేబెంచిన కొడుకు, వీరిద్దరు నొకకొమ్మను పూచిన పూవులు, నాహృదయాకాశమున సూర్యచంద్రులు- వారిద్దరి సంఘట్టనము వలన నాహృదయము చూర్ణీకృత మగు చున్నది.... వలదు. గురుదేవా! యుద్ధము వలదు. నా చంద్రగుప్తుడు వీధులవెంబడి బిచ్చమెత్తి జీవింపనిండు. యుద్ధ మనావశ్యకము. ✓

చాణ — బేలా! సమరసమ్ముఖమున నుపసంహార
ము మార్చియా? ఆకాశమెంత నిశ్శబ్దముగా నున్నదో గనుచుం
టివిలేదా? ఇయ్యెడ తుపాను రాగలదనియెంచి యందరూ
శిబిరిబిగబట్టి దానిఝంకారము విన వేచియున్నారు. అం
తయూ సిద్ధమైనది. స్త్రీలప్రార్థనములు విన టకునా బుడిబుడి
దుఃఖములు గనుటకునా ఇది యవసరముకాదు. నీవు శిబిరమునకు
బొమ్ము.

ముర — స్త్రీలప్రార్థనములు, నారీముఖములు నగణ్యో
గనమా? స్త్రీల నింత యవజ్ఞసేయ జనునా? నాహృద
యము నెట్టియూగి వేధించుచున్నదో మీరేమెఱుంగుదురు?
దాని నే నెట్లు సహించియుంటినో మీరు భావింపగలరా?

చాణ — అజ్ఞురాలవు. నీకేమి తెలియును? కాంతా
గారలోహాద్వారములపై తమనెత్తురులను గ్రొమ్ముకొని చిమ్మిన
రక్తముచే నేలను సిక్తముగజేయు సద్ధావేశులను పురుషుల
లుప్తగౌరవ దీనతామహాత్మ్యము నీవెట్లెఱుంగ గలవు? నారీ!
ప్రతిహింసాజ్వాలను నీ వెట్లు చూడగలవు? అది యొడలంతయు
భగ్గుభగ్గుమని మండుచున్నదే!...విరక్తురాలవు గాకుము,
పొమ్ము నీశిబిరమునకు-యుద్ధ మనివార్యము.

ముర — కాని, గురూత్తమా!

చాణ — వెఱ్ఱివేమి? (ఆమె పోవును) పంచముఖము,
సాలీడు చర్మము, శవముదహించినకంపు, ఆముదమురుచి, గాడిదె
స్వనము — వీటినన్నిటినొక గూనలో బోసిపొయ్యిపై బెట్టితిని.

ఇంగలి పరిణామ మెట్లుండునో చూచెదను. ఒకవిధమైన వ్యంజనము సిద్ధమగును. ఓ అదృశ్యమహాశక్తీ! కుళ్ళినపశుశరీరములనుండి వెడలు దుర్గంధముచే పూరితమగు నీశ్మశానమున నాచేయిపట్టి యెంత యానందముతో విహరించుచున్నావు! భళిరే!

ఎల్లెడ నుండు బిందువు లాకాశమున ధగద్ధగాయమానముగా వెల్గుచున్నవి. నీ వీ యగ్నిజ్వాలాప్రవాహముమధ్య నున్నను కాలిపోవుట లేదు. శుద్ధబ్రహ్మతేజఃపుంజమగుటచేతనే యారిపోవుట లేదు. కాదు కాదు. కలియుగమున బ్రహ్మతేజస్సారి యొకసారి యందరికి చూపవలసియున్నది... ప్రేయసీ! అంతే కదా? నీవు పండ్లికిలించి నవ్వుచు నౌనౌ ననుచుంటివా! నాకు వినబడినట్లే యున్నది! నీ వెంతటక్కరివి? నీపై మోహముచే చివరకు వెర్రివాడ నగుదునేమో?—ఎవడది? కాత్యాయనా! (అతడు వచ్చును)

కాత్యా—ఆర్యా! నేనే.

చాణ—ఇంత రాత్రి మీరినది-నీవిటేల వచ్చితివి?

కాత్యా—వార్త యొకటి దెలుపవలసి వచ్చితిని.

చాణ—ఏమివార్త?

కాత్యా—నందుని వృద్ధమంత్రి వచ్చినాడు.

చాణ—వచ్చినాడా? ఏమివింతలు?

కాత్యా—అతడు సంధి నడుగుచున్నాడు.

చాణ—సంధి యేమని?

కాత్యా—ఆ మాటయు నీ మాటయు జెప్పి, “ అన్న దమ్ములకు యుద్ధమేల? సగము రాజ్యము నీకిత్తుము. ఓయీ! సంశయము తెలివితక్కువవాఁడు. ఏదియో యపచారము కొంచెము చేసిన, అగ్రజుఁడవు, మాపాటి మన్నింపఁజాలవా?” అనెను.

చాణ—బాగుబాగు. చంద్రగుప్తుఁ డందులేఁడా?

కాత్యా—ఉన్నాఁడు.

చాణ—ఈమంత్రి చాల నేర్పరి. చంద్రగుప్తుఁ డేమనెను?

కాత్యా—ఏమియు ననలేదు.

చాణ—నీ వేమంటివి?

కాత్యా—మీతోడ నాలోచించి యుత్తరమిచ్చెద నంటిని.

చాణ—ఆహా! ఆతని నాయొద్దకేల తీసుకొని రాలేకపోతివి?

కాత్యా—వచ్చుట కాతఁ డొప్పుకొనలేదు.

చాణ—మంచి యుక్తి బన్నినాఁడు: ఏ రాజయు నని వార్యమని యెంచి...హాయిగ

కాత్యా—మీ రేమందురు?

చాణ—అనుటకే మున్నది? “మనసా చింతితం కార్యం వచసా న ప్రకాశయేత్”

కాత్యా—నేను మీమిత్రకోటిలోని వాఁడనుకానా?

చాణ—నామతమున ‘న మిత్రేష్వపి విశ్వసేత్’... సర్వమూ నీకుఁ జెప్పుట కిది యదను కాదు, కాని యింత

మాత్రము చెప్పగను. సంధి పొసగనేరదు.

కాత్యా—ఏల?

చాణ—నీ విష్ణుగుప్తు శిబిరమునకు బొమ్ము. నేనొక సారి నా ప్రేయసితో నాలోచింపవలయు.

కాత్యా—అయ్యో, మీ ప్రేయసి యెవతె?

చాణ—ఎఱుగవా? నాకొక గణిక కలదు

కాత్యా—మీకు గణికయునా? (చాణక్యుడు పక్కున నవ్వ కాత్యా॥ నివ్వెరపడును.)

చాణ—ఈ సందమంత్రిని నీ వెఱుంగుదువా? కాత్యాయనా!

కాత్యా—ఎఱుగకేమి! బాల్యమున మేమిద్దర మొక చోటుననే విద్యాభ్యాస మొనర్చితిమి. మనోవిజ్ఞానముం దత డారితేరినాడు. అహోరాత్రములు సాంఖ్యశాస్త్రము నభ్యసించినాడు.

చాణ—నీవు పాణినీయము నూరి త్రాగితివి కాబోలు!

కాత్యా—మీరు హేళనము చేయుచున్నారు. పాణిని సూత్రము లన్నియు గూఢ తత్త్వమునకు నిధానములు. ఇటు చూడుడు—

చాణ—కావుననే సర్వమును మఱచుకొంటివి. అగుము నీ పాణినీయవ్యాఖ్యానము వినుటకు నాకు వ్యవధిలేదు. వింటివా! వ్యాకరణముచే జిన్న మెత్తుకార్యము నిర్వర్తితము కానేరదు.

కాత్యా—పాణిని తుచ్ఛుడని మీకు దోచెనా ? ఇది వినుడు—

చాణ—నందుడు నిన్ను జెఱలో బెట్టె నంటివే, దానికి హేతువు నిప్పుడు తెలిసెను.

కాత్యా—ఆతడు నన్నేల కైదు జేసెను?

చాణ—నీపాణినీమతమును నూపిరాడక-నీవెప్పుడును పాణినిని నూరుచుందువు. రాజ్యమున మృత్యుభయము వచ్చెను-పాణిని; యుద్ధ మూసన్నమాయె-పాణిని; అతి వృష్టి కలిగె-పాణిని, మహారాజుగారు భార్యలో గలహించిరి-పాణిని ...నీపాణినీ పీడచే నాతని మతి పోయినది. ఏమియు తోచ దాయె.

కాత్యా—ఏం?

చాణ—వినగా వినగా నీపాణిని రాజుగారి మదికి గృపాణియయ్యె. తలతిరుగ నారంభించెను. ఆహారమం దరుచి పుట్టెను. అనంతరమున నిరుపాయుడై నిన్ను కారాగారమున భద్రపఱచెను. పాణిని మూలమున గొప్పముప్పు మూడినది. ఈతప్పు పాణినిది.

కాత్యా—ఏతప్పు?

చాణ—ఎవరునూ కంఠపాఠము చేయజాలని గొప్ప వాక్యకరణమును వ్రాసెను.

కాత్యా—పాణినీయరహస్యము మీకు దెలియక పోవుట గురుదుఃఖహేతువు. పాణిని సూత్రములు—

చాణ—ఊఁ. చాలా గొప్పవి! నీవు శిబిరమున కిక దయసేయుము. ఏ పాణినీసూత్రము ననుసరించి యిట్టుల మాటలాడు చుంటివి?

కాత్యా—పాణిని యిట్టి తుచ్ఛవిషయముల దన తల కెక్కనీయలేదు.

చాణ—పొమ్ము. శీఘ్రముగా చంద్రకేతు నిట బంపుము.

కాత్యా—అట్లే పంపెదను. కాని పాణిని—

చాణ—ఇంకను పాణిని అనుచుంటివా? యుద్ధ భూమికి వచ్చితిమి. ఈ నిశీథము పాణిని విషయమై చర్చించుటకు దగిన సమయము కాదు. ఆవశ్యకమగు పని కలదు. చంద్రకేతుని రమ్మనుము.

కాత్యా—కాని, పాణిని సూత్రములు—

చాణ—పాణిని నతని సూత్రములనూ సింధువులో పడద్రోయుము. పొమ్ము.

కాత్యా—పాణిని వ్యాకరణము కేవలము వ్యాకరణమే అని మీ యందరి యభిప్రాయము. మూర్ఖులు! పాణిని యందు వేదాంతసారమున్నది.

చాణ—కాత్యాయనా! వేగము పొమ్ము. వాక్యార్థ మిక్కడ సేయకుమని చెప్పలేదా? పొమ్ము.

కాత్యా—పోవుచున్నాను. కాని, మీరు పాణినియెడ నపచార మొనర్చితిరి. (పోవును)

చాణ—అమాయికుడు, మటుమాయ మెరుగడు. ఆలోచనా బుద్ధియూ పూజ్యము- కేవల ప్రకృత్యనుసారము పశువువలె పని సేయువాడు...(ప్రేయసీ! ఏమందువు? నందుని మంత్రి మంచియుక్తి బన్నినాడు, పరాజయ మనివార్యమని యెరిగి యిట్లుచేసెను; ఇంకేమెత్తు వేయగలడు? నేను వాని పై కన్నువేసి యున్నాను, నీవుకూడ నప్రమత్తవై యుండుము. మంత్రిసత్తమా, తెలెరిగి వాతబెట్టితివి, కాని చాణక్యుడు నీకు దుర్గ్రాహ్యుడు సుమా! వానికి మునుముందు హెచ్చరిక గలిగించితివి. నీమాట కిదియే పరిణామము. ఇక జూడుము.

(చంద్రకేతు వచ్చును)

చ॥ కే—స్వామీ! యభివాదనము-ఏమి యాజ్ఞ?

చాణ—యుద్ధము సేపు, మీరు ప్రాణములపై నాశ వీడి పోరినగాని మనకు జయము ప్రాప్తించదు సుమా.

చ॥ కే—ఇప్పుడీమాట యేల? నాయందు మీకు విశ్వాసము లేదా?

చాణ—లేకేమి?

చ॥ కే—ఐన నిట్టిమాటలేల?

చాణ—నాకు చంద్రగుప్తునెడ బూర్ణ విశ్వాసము లేదు.

చ॥ కే—చిత్రముగా నున్నది! గురువరా! అట్లనెద రేల?

చాణ—ఆతని హృదయమున రాజ్యాశకు దోషుబల వత్తరమగు నింకొక ప్రవృత్తి గలదు. అది వానిని వెన్కకు

లాగుచుండును; చూడఁజూడ చంద్రగుప్తుని దీప్తిమంతమగు ముఖము మేఘచ్ఛన్నమగుచుండుట నీవు కనలేదా? అప్పు డప్పుడు బిందుధార లొలుకుచుండును. అట్టి దుష్ప్రవృత్తి యాతని మనమును గ్రమ్మికున్న నాతనిశౌర్యము దుర్జయము ననివార్యము కాదా?

చ॥ కే—అట్టిచో నేమియాజ్ఞ?

చాణ—యుద్ధము నంతమగునవరకూ నీవాతనివెంటే యుండవలయు. ఒంటరిగా విడువవలదు. సమరము ముగియు వరకు వెనువెంట దిరుగుచుండుము.

చ॥ కే—చిత్తము.

చాణ—పొమ్ము. మురాసహితుడనై యీపర్వతము దిగువ నంతెనయొద్ద మీవిజయవార్త ప్రతీక్షించుచుండెదను.

చ॥ కే—చిత్తము. (పోబోవ)

చాణ—ఇంకొక్కమాట. చంద్రగుప్తుడు నిదురించెనా?

చ॥ కే—చిత్తము,

చాణ—ఒకసారి—వలదు—నిదురింపనిమ్ము... ముర నూ... కాదు... ఈరాత్రి ప్రయోజనములేదు, నీవు చీకటితోడనే లేచి చంద్రగుప్తుని మేల్కొల్పి మురమేల్కొనక ముందు యుద్ధభూమి కాతని కొనిపోవలయు. వారొకరినొకరు చూచిరా ప్రమాదము సంభవించును. జాగ్రత్త!

చ॥ కే—అట్లే యొనర్చెదను.

చాణ—పొమ్ము (ఆతడు పోవ) ఉదారయువకుడు! సందియమేమి?—ప్రేయసీ! కాదు కాదు. ప్రమాదమున పరిధిదాటినది... బుద్ధిహీనుడు! ఇంకొకనికై తనసర్వస్వము నగ్నికి నాహుతింబలె సర్పించుచున్నాడు. చంద్రగుప్తుడు నీకేమి కావలయు? మూర్ఖుడా!

---

[illegible]

—:♦:—

గాంధార రాజసభ—ఏంటిగోనసు సెల్యూకసులు సభాసదులు.

ఏంటి—సెల్యూకసు సార్వభౌమా! నీవు నా ఖైదివి.

సెల్యూ—నే నెరుగుదును.

ఏంటి—నాటిదంభ మెక్కడకు బోయెను?

సెల్యూ—నాకెప్పుడును దంభము లేదు. యుద్ధమున జయము రాదా, పరాజయము రాదా? అనేక యుద్ధములందు నేను జయించితిని, నేడు నీకోడితి; తిరుగ యుద్ధమున-

ఏంటి—ఇక నీవు యుద్ధము సేయబోవు, ఇదియే నీచరమ యుద్ధము.

సెల్యూ—ఇదియే కడసారియా? నన్ను చంపదలచితివా?

ఏంటి—చంపను... చంపను.

సెల్యూ—ఇంక నేమి సేయదలచితివి? ఏంటిగోనస్,

అదేమి? నీకన్నులు హింస్రాగ్నిచే బ్రజ్వరిల్లుచున్నవి, ముఖ మెఱ్ఱవారినది, పండ్లు పటపటలాడుచున్నవి; నీమనమున నేదియో పైశాచికసంకల్ప ముత్పన్న మగుచున్నది. దాని మూలమున నీదేహము ప్రకంపిత మగునట్లున్నది.

ఏంటి—లేదు-నిన్ను చంపను... చంపను.

సెల్యూ—ఆమాట పలుమారేల యుచ్చరించెదవు? నన్నేమి సేయనెంచితివి?

ఏంటి—నేను సుసభ్యుడనగు యవనుడను. కావున ద్వంద్వయుద్ధమున పోరాడి నగుకువాడను; హింస్రములగు వ్యాఘ్రము లోకదానితో నొకటి హోరాహోరినిబోరి శత్రువును యుద్ధానంతరమున చీకటికోణములో కైదుచేయును గాని హత్యచేయవు- నిన్నుకూడ చిరకాలము గాఢాంధకారమున జెయిలో నుంచెద- చంపను, భయమునలదు.

సెల్యూ—అట్లుకాదు. ఒక్కసారి హత్యజేయుటయే శ్రేయము. ముక్కముక్కలుగా గోసి నన్ను చిత్రవధ జేయకుము.

ఏంటి—నేను యవనుడ, నాగరకుడ. నిన్నామరణము బందియందుంచెద-- సూర్యరశ్మికైనను చొరశక్యముగాక, వాయువునకైనను దుర్గమమగు గదిలో నుంచెద, హత్యచేయను.

సెల్యూకస్ నేను బితృహీనుడ నోట జగదీశ్వరుడు నాయందు దయదలచి యీబాల్యము వచ్చుగానినా నొనర్చి యీధరా మండలమున విడిచెను. ఘోరదారిద్ర్యబాధను పోద్రోలి

శౌర్యదక్షతాబలమున నేనాఘ్యతుడ నైతిని. ఇందు లజ్జాకర మైన విషయమున్నదా?

సెల్యూ—నేనెప్పుడైన నట్లంటినా?

ఏంటి—నీ వన లేదు. కాని లోకమర్యాద యిది. నాతండ్రి నేను నే జెప్పలేనందున మంచిచెడ్డల నారయక లోకులు నే జారజుడనని భావించి నాయెడ జుగుప్స వహించి గేలిచేసి నన్నేనగించుచున్నారు. నాతండ్రిని నేనెరుంగమి నిజము, కాని యశేషముగూడా మీవంటిచర్యలు కలవాడై యుండవలయునుగదా! జారజుడనా? నాజన్మమునకు నేను త్తర వాదని గాను, అది దైవాధీనము, విఖ్యాతమగు పౌరుషము నాయధీనమే, నాకృత్యములకు నేను త్తరవాదిని; ఎన్నడైన నీచకార్యముల నేనొనర్చుట గంటివా? లేక వింటివా?

సెల్యూ—లేదు. అట్టిలోచ్చు నీయందు లేదు. నీ వుదారుడవే!

ఏంటి—నీవిష్టాము నన్ను మెచ్చిన లాభమేమి? ఈ యవస్థయందు నీచే నేమాటనైన జెప్పింపవచ్చును. అదే నీకొమార్తె వచ్చినది.

(హెలెన్ వచ్చును)

హెలె—ఆహా! తండ్రీ! సార్వభౌమునకా యిట్టిదశ? అయ్యో!

సెల్యూ—అమ్మా! నీకెట్టి దుర్గతి ఘటిల్లె! మన మొంతని ర్భాగ్యులము!

ఏంటి—మీసాదర సంభాషణ ముగిసినదా? లేకున్న ద్వరలో ముగింపుడు. నేనాగెద, అంతనిష్ఠురుడ గాను; ఇదే మీరుకడసారి జూచుకొనుట.

హేలె—ఏమి? మారు కడజూపు లివియేనా?

ఏంటి—రాజకన్యా! అగును. నీతండ్రికి శిక్షవిధించితి. ఆమరణము చీకటికోణములో ఖైదు.

హేలె—అట్లే కానిమ్ము.

ఏంటి—నీవు చెప్పవలసిన దేమైన గలదా?

హేలె—ఏమియూలేదు. వీరునియెడ వీరు డెట్లాచరింపవలయునో వీరున కెరుక. జయించినవాడు బందీకృతుని యెడ నెట్లాచరించునదీ యాతనియభిరుచి ననుసరించియుండును. అట్టియెడ నేనేమి చెప్పఁగలను? అనధికారచర్చ సేయను.

ఏంటి—సెల్యూకస్, నీకొమార్తెకు పితృభక్తిమెండు.

హేలె—ఏంటిగోనస్- నీరాజ్యసంబంధమగుచర్చ నీవుసేయుము, తండ్రియెడ కూతురికిగల యభిమానము కన్యాముఖమున నెఱుంగవలయుగాని, నీనోటఁగాదు.

ఏంటి—ఇంకను గర్వమే?

హేలె—ఓయీ! నీవు నన్నిక్కడ కేల రప్పించితివో నేనెరుగుదు. నీయత్నమంతయు గుజ్జు కురుచచేతుల గువలయేశు గొనగోరునట్లున్నది. కాని చంద్రుడు నీకుచిక్కువాడు కాడని దృఢముగా నమ్ముము. ఇప్పుడు జయము నీకు జేకూరి

నది, సామ్రాజ్యమున కధిపతివైతివి ; నీయిష్టమువచ్చినరీతి జరుపగలవు. కాని నాకొక రాజ్యము గలదు, దాని కధీశ్వరిని నేను ; ఆరాజ్యమున బ్రవేశింప నీతరముకాదు. తండ్రీ! వెను దీయకుము. వీరుడవు కాన వీరవ్యవహారము ననుసరించి చీకటి కోణముపకు బొమ్ము. భీతిల్లి సంకోచింపకు. నేనుగూడ బోయెద. ఇక మనకిద్దరకు వియోగము సంభవింపనున్నది. నాకు సెలవొసంగుము. ఏమిది ? తల వంచియుంటివేమి ?

సెల్యూక—కుమారీ! లేదు లేదు. అటులే కానిమ్ము-మనమిరువురము కారావాసదుఃఖము ననుభవింపవలయునా?

హెలె—తండ్రీ ! ఈవియోగమున మనకిద్దరకు దుఃఖము సమానము- నీకన్నుల కెట్టియంధకారము కట్టినట్లున్నదో, నాకు నట్టియంధకారమే యగపడుచున్నది. నీవు పురుషునివలె సహింపుము, నేను స్త్రీవలె సహింతును; భయమేల? ఏంటిగోనను క్రోధతామ్రాక్షుడై మనల గనుచున్నాడు, జాగు సేయనేల ?

ఏంటి—హెలెన్ ! నీకు నాపై నింతకోపమేల ? నా యెడ నింతవిముఖురాల వయ్యెదేల ? నన్ను బెండ్లియాడ రాదా? నీతండ్రికి దాసుడనై వర్తింతునే. ఆతని నీసింహాసనముపై గూర్చుండబెట్టెద- కాంతామణీ! నాపై బ్రసన్నురాలవు గమ్ము, రాజ్యమిచ్చెను. ఊరక కష్టములపాలు గానేల?

హెలె—ఏంటిగోనస్ ! నీ వెంత తెలివిమాలిన వా

డవు! ఎరజూపి నారీహృదయము నాకర్షింప జూచెదనా? స్త్రీ ధర్మము ప్రభాతసూర్యునికంటె నధికభాస్వరము, మృత్యుదేవతకంటె నెక్కుడుప్రబలము, మాతృప్రేమకన్న పవిత్రతర మునుమా! అట్టినారీహృదయమును బిడికెడుబుగ్గినిచ్చి కొన సాహసించుచుంటివి! ఏమి నీబుద్ధిమాంద్యము! నిన్నుజూడ నాకు జాలియు రోతయు గల్గుచున్నవి.

ఏంటి—మంచిది. సెల్యూకస్! ఇక నాలోపము లేదు; ఓయీ, వీరినిద్దరిని వేరియొక చీకటికోణమున నుంచి జాగరూకతతో గాపాడుచుండుము.

హెలె—తండ్రీ, సెలవిమ్ము.

సెల్యూ—కుమారీ! అయ్యోదశ!

హెలె—ఇదియేమి? నీకంట నశ్రువులు గ్రమ్మినవి. వీరుడవయ్యు దుఃఖమునకు లోనైతివా? నేను చూడజాల! బాలురయాకలి, వృద్ధులయవమానము, రోగులవిసర్జనము, శవపదాఘాతమూ మొదలగు మర్మభేదదృశ్యముల జూడగలనుకాని, నీకంట వేడినీరొల్కుట జూడజాలను. ఆతనియిష్టమే జరుగనిమ్ము. నీకొరకు నేసర్పింప జాలనిదెద్దియు లేదు. ప్రసన్నపూర్వకముగ [illegible] మ్మో. నీవు లజ్జచే శిరమువంచి మోముముడిచి యేడ్చుచుంటివా? నాగుండె నీరగుచున్నది. గోరుచుట్టుపై రోకలిపోటు... ఓహో! సరే! ... ఏంటీగోనస్! నిన్ను నే బెండ్లియాడెద, నీపాదములసన్నిధిని దాసినై వర్తించెద, నాతండ్రిని విడువుము.

సెల్యూ—ఆ, ఆ, వలదు; వలదు; అట్లెన్నటికి జరుగ వలదు. అంతకన్న నరకమున ద్రోసినను సంసిద్ధుడను. కన్య నమ్మి కార్యముసాధించువాడ గాను, నా కట్టి స్వేచ్ఛ వలదు. నేను యవనుడ. ఇది క్షణికదౌర్బల్యము. భటులారా! నను పుడు, కారాగృహమునకు బోవుదను. (ప్రభునిష్టమెట్లో అట్లే జరుగనిండు. అమ్మా! నాకు సెలవిమ్ము (ముద్దుపెట్టుకొనును)

(వారందరు. పోవుచుండ ఏంటిగోనసు వారినాపి)

ఏంటి—సెల్యూకస్! నీవు ముక్తుడవు- జారజుడనని నాకెంత యపకీర్తి వచ్చినను నేను యవనుడ, మహత్త్వమన నెరుగుదు. ఈగుణము కేవలము హెల్లెన్యమే యనజెల్లదు, స్వర్గీయ మానవులయు - ఇంతకన్న సున్నతైశ్వర్యకల్పన మానవులయందు గానము. నిన్నుజూడ కఠినహృదయుడనగు నాకన్నులే బాష్పపూరితములయ్యె-భగవన్మహిమ! హెలెన్, నిన్ను బొందగలుగు యోగ్యత నాకులేదు, నా పేరాసను మన్నింపుము. సెల్యూకస్, ఈసింహాసనము నీవు గైకొమ్ము. మీకు శుభములు చేకూరుగాక! నా బాహుబలమున నెన్నడో యొక్కడనో రాజ్యము నార్జించుకొనెద- కాలమున కవధి లేదు, పృథ్వికంతము లేదు.

---

నాల్గవ రంగము

(యుద్ధభూమి-స్త్రీశిబిరమున ఛాయయు చెలికత్తియలు)

ఛాయ—ఈయుద్ధఫలితము నెరుగుటకై నామనము తత్తరపడుచున్నది. దూరమున గోలాహలము మాత్రము వినబడుచున్నది. సంగరపిపాసచే గుండె లవియుచున్నవి.

చెలి—రాజకుమారీ! నీకింత సమరతృష్ణ యేల?

ఛాయ—నే నాతని కయోగ్యురాలగా నని దృష్టాంతీకరింపవలయు.

చెలి—ఎవనికి?

ఛాయ—చంద్రగుప్తునకు.

చెలి—పెక్కుకష్టముల పాలయ్యెదవు సుమా!

ఛాయ—ఎల?

చెలి—చంద్రగుప్తుని వలచితివో?

ఛాయ—వలచితినో లేదో యెరుగను, కాని నిదురించినప్పుడూ, మేలకువతో నున్నప్పుడును వానిపైనే ధ్యానము. నిన్నరాత్రి యెట్టి కల గంటినో యెరుంగుదువా?

చెలి—బాగుబాగు. నీవు కన్న కలను నే నెట్లెరుంగ గలను? సరీ చెప్పుము.

ఛాయ—నే నాకాశమున మెలమెల్లగా పైకి పోవుచుంటిని. అక్కడనుండి దిగువ జూచుసరికి భూమియు చంద్రగుప్తుడును దప్ప వేరొక వస్తువు నాకగపడలేదు. ఇంకను పైకి పోగా గ్రమముగా పృథ్వి చిన్నదై కొంతసేపటికి దృష్టిపథమునుండి

లోపించెను- చంద్రగుప్తు డొకడే సూర్యునిభాతి ప్రకాశించు చుండెను.

చెలి___పెక్కుకష్టముల పాలయ్యెదవు సుమా? నా మాట వినుము.

ఛాయ___ఎందుచేత ?

చెలి___ఈవ్యాధిచే.

ఛాయ___ఏవ్యాధి?

చెలి___ప్రేమవ్యాధి.

ఛాయ___ఇదియొకరోగమా?

చెలి___సందియమేమి?

ఛాయ___ఐనచో నీవ్యాధిచే మరణము నాకు సంప్రాప్తించునుగాక ! ఇంతకన్న సుఖతరమగు మృత్యువును నేగోరను. (చంద్రకేతు వచ్చును)

సోదరా! యుద్ధవార్తలేమి ?

చం కే___నాగుర్రము పోయినది, వేరొకదానికై వచ్చితిని.

ఛాయ___సమరవిశేషముల జెప్పవేమి?

చం కే___చెప్పుట కేమున్నది? మనకు బరాజయము.

ఛాయ___పరాజయమా ?--అన్నా ! -- చంద్రగుప్తు డెక్కడ ?

చం కే___అతడు గొప్పసంకటములో జిక్కుకొన్నాడు కావున సాయము సేయుటకై నేబోవుచుంటిని.

ఛాయ—అగుము. నేనుకూడా మీకు తోడువచ్చెద.

చ॥ కే॥—మంచిది—అట్లే రమ్ము.

ఛాయ—చెలీ! నీవు శిబిరమునకు బొమ్ము. (ఆమె పోవును) భగవానుఁడ! సుయోగము లభింపజేసితివి, నేను కృతకృత్యురాల నగునట్లు వరము ప్రసాదింపుము. ఆతను చిక్కున బడినాఁడు, నేనాతని ప్రాణరక్షణమునకై యేగుచుంటిని, ఇందు నా ప్రాణము లర్పింపవలసి వచ్చినచో నవ్వుచు నాటినిర్వహించెదను, అందుకు మారుగ నొకముహూర్తమాత్రమాత్రము స్మితవదనుఁడై ప్రేమపూరిత దృష్టులతో నాదెస జూచెనా, నాజన్మము సార్థకము కాఁగలదు.

(చంద్రకేతు వచ్చును)

చ॥ కే॥—ఛాయా! గుఱ్ఱములు సిద్ధముగా నున్నవి.

ఛాయ—ఇదే వచ్చితిని. మాహేశ్వరీ! మహిషాసురాది దానవుల ద్రుంచునప్పుడు నీకుండిన శక్తిలో శతాంశము నాకు దయసేయుము. పోదరా! రమ్ము.

---

నవమరంగము

---

(నదియొడ్డున నంకెన)

చాణ—ఆకలిచే కడుపుమంట భరింపలేక నాలుకలు చప్పరించుచు గొలుసులను తెంపుటకు గురగురలాడుచున్న వేటకుక్కల నుసికొల్పి రణరంగమున విడిచితిని. ఈసమరమున నది హాయిగా ప్రవాహిత భైరవరక్తధారాపానము సేయును.

ఈనిబిడారణ్యమున, పులులు, రేచులు, ఎలుగులూ మొదలగు ఘాతుకమృగంబులు లేనిలోటు మనుష్యులు తొలగించిరి. భేదమేమన-ఘాతుకమృగములు కడుపునింపుకొనుటకన్యోపాయము లేనితరి మానవుల జంపి తద్రక్తపానము జేయును. మనుష్యులన్ననో, లోభాంధకారవశత హింసాప్రేరితులై మొండిగొరుగుల కంఠములను నరకుకొందురు. ఈసృష్టియంతయు కసాయికొట్టు. మార్తాండుడ స్తమించనున్నాడు, పగటిచితాగ్ని నలుదెసల చిరచుర మాడుచు ప్రసరించుచున్నది. రేపు సూర్యుడు మరల నుదయించును. ఒకానొకదినమున సూర్యుడే యుండడు. అట్టిదినము రాకపోదు. ఈసూర్యుని క్రమముగా క్షీణించి మహోగ్రమై ఘోరాంధకారమగును. అందలి పాండుర స్వర్ణధామము పాంసుపుంజంబుగ పృథ్విపై బడగలదు. కోట్లకాలమున కాప్రకృతియు నుండక కృష్ణపూర్ణమగు శూన్యాకాశమున నదృశ్యమగును. ఆహా! అప్పటిదృశ్య మెంతగరిమానుమయముగ నుండునోకదా !

(కాత్యాయనుడు వచ్చును)

కాత్యా—ఆర్యా! యుద్ధమున మనకు పరాజయము.

చాణ—పరాజయమా! ఏల ?

కాత్యా—చంద్రగుప్తుడు యుద్ధభూమినుండి వెన్నిచ్చి పోవుట గాంచి మనసైన్యమెల్ల చెల్లాచెదరై చీలి పంచబంగాళ మాయెను.

చాణ—చంద్రగుప్తుడు పారిపోయెనా ?... ఎక్కడ ?

కాత్యా—పూర్వునకు.

చాణ—ఆత డేదిక్కునకు బోయెనో అడుగుటలేదు. ఇపు డెక్కడ నున్నాడు?

కాత్యా—నే నెరుగను.

చాణ—నే నడిగినది తెల్లనది. చంద్రకేతు వెక్కడ?

కాత్యా—అదియు నెరుగను, కొలదికాలముక్రిందట నాతడు గుఱ్ఱముపై నుండగా జూచితిని.

చాణ—మూర్ఖరాజా! నీవింతవఱకు నేమి సేయు చుంటివి?

కాత్యా—ఈపర్వతశిఖరమునుండి యుద్ధగతిని జూచు చుంటిని.

చాణ—గతిని జూచుచుంటివా? ఎప్పుడు మనకు విజయము సిద్ధమయ్యెనో, ఎప్పుడది చేతజిక్కెనో, అప్పుడేమియు జేయక యూరక జూచుచుంటివా?

కాత్యా—అదిగో, చంద్రగుప్తుడిటేవచ్చుచున్నాడు.

చాణ—ఏడీ, ఇక్కడకే వచ్చెనా? అట్లైన నాశకలదు. మంచిది. కాత్యాయనా, నీవుబోయి మనసేనల నాశ్వాసింపుము. "చంద్రగుప్తుడు కాంక్షీకుడు కాలేదు, ఇదే వచ్చుచున్నాడ" ని చాటింపుము, త్వరగా బొమ్ము- మారుమాటాడకు...ఇక చింతలేదు-"ముల్లుతో ముల్లు పుచ్చవలయు" మురా! మురా! (ఆమె వచ్చును)

ముర—గురూత్తమా! ఏమియాజ్ఞ?

చాణ—ఇక్కడ నిలుచుండుము- నీవేడ్వ గలవా?

ముర—ఇదేమి ! మహాత్మా !

చాణ—చంద్రగుప్తుడు వచ్చుచున్నాడు,నిపిప్పు డేడువ వలయును.

ముర—ఏడీ? ఏడీ? నాకూన వచ్చుచున్నాడా ?

చాణ—జాగ్రత్త ! ఈసమయమున స్నేహము పనికి రాదు. ఇప్పుడు నీవు తీవ్రకోపము, దారుణాభర్త్సనము, వేడి కన్నీరు, పుత్త్రునియెడ దల్లికిగలయధికారము, స్వాభిమానమూ మొదలగువాని నభినయింపవలయును, వీటిని నీహృదయమందు నెలకొల్పుము. తెలిసినదా ? త్వరపడుము...సిద్ధముగా నుంటివా ?

(తల వంచుకొని చంద్రగుప్తుడు కత్తితో బ్రవేశించును)

ఇదిగో చంద్రగుప్తుడు, మురా ! యుద్ధమున జయించి వచ్చినాడు. ఒకసారి గట్టిగా కౌగిలించుకొనుము, ఇప్పటికి వీర మాతవైతివి; సంతోషించుము.

చ॥గు—లేదు, గురుదేవా ! నేను జయించిరాలేదు.

చాణ—ఏమది ! ఎట్లువచ్చితివి ?

చ॥గు—యుద్ధవిముఖుడనై వచ్చితిని.

చాణ—నమ్మజాల, అసంభవము; మురకొడుకు యుద్ధ భూమిని జయించవలయు, లేదా ప్రాణములు త్యజించవలయు, వెన్నిచ్చువాడు కాడే !

ముర—కాందిశీకుడవై వచ్చితివా ! ఎంత స్థిరచిత్త

ముల్లో నామాట బుల్కుచున్నావు. యుద్ధభూమినుండి పారి వచ్చితివా? చావలేక పోతివా? పిరికిపందా!

చాణ—లేదు లేదు, ఇది క్షణిక దౌర్బల్యము. చంద్రగుప్తా! పొమ్ము. యుద్ధము సేయుము.

చం గు—నేను సేయజాలను. (కత్తి చాణక్యుని పాదములయొద్ద బెట్టును)

చాణ—ఏమి చేయజాలవు?

చం గు—తమ్ముని గాత్రముపై కత్తివేయ జాలను.

మురా—ఓరీ మూర్ఖా! భీరూ! కుత్సితుడా! ఏమంటివి?

చం గు—తల్లీ, మూర్ఖుడగాను- పిరికిపాడను గాను. అతడు నాకు తమ్ముడు.

చాణ—నిన్ను నిర్వాసితుని జేసినవాడు నీకు తమ్ముడా?

చం గు—ఐనను నాతమ్ముడే.

మురా—నీతల్లి నవమానించినవాడు నీకు తమ్ముడా? ఊరకుండెదవేల?

చాణ—ఏయధముని పాలనము దౌరాత్మ్యమునకు బెట్టినపేరో అట్టి ద్రోహియు నుద్ధతుడును నీకు భ్రాతయా?

చం గు—గురుదేవా! భ్రాతృవధము సేయుమనియా మీయాజ్ఞ-?

చాణ—అహో! ధర్మయుద్ధమున- కురుక్షేత్రమున శ్రీకృష్ణు డేమనెను?

చ॥గు—గురూత్తమా! శ్రీకృష్ణునియుక్తి నాకు నచ్చుటలేదు.

చాణ—ఈపాపముచేతనే యార్యావర్తము చెడినది. చంద్రగుప్తా! గీతారహస్యము నీవే మెరుగుదువు? శాస్త్రచర్చయం దధికారము బ్రాహ్మణునిది కాని నీకెక్కడిది?

చ॥గు—ఆయధికారమును వారే అనుభవింపనిండు. నాకేల? సెలవొసంగుడు.

చాణ—చంద్రగుప్తా! ఈదౌర్బల్యము నీయందు నే నప్పుడప్పుడు గనుచుంటిని. ఇతరసమయములయందు దీనివలన హాని కలుగదు; పగలు శుష్కనైరాశ్యమునబడి యలసునివలె కాలము గడుపుము, రేల వేడికన్నీరోడ్చి, ప్రక్కలునదుపు చుండుము? అందుమూలమున నష్టము రాదు. కొన్ని సమయములం దేడ్చుటయే శోభస్కరము. కాని కర్మక్షేత్రమున నిలుచునప్పుడిట్టి దౌర్బల్యము సాంఘాతిక హేతువగును. ఇది భూకంపమువలెబుట్టి యనేకశతాబ్దములరచనను మట్టిలోగలుపును. చంద్రగుప్తా, నీజీవితో సాధికారకక్షణములో నిష్ఫలము గావింపకుము. ఈయలసతను జీర్ణవస్త్రముభాతి విసర్జించి యుద్ధమున కగ్రసరుడవుగమ్ము, లెమ్ము.

చ॥గు—నన్ను క్షమింపుము.

మురా—నీవు నిజముగా నాపుత్రుడవా?...ఏమందుదు—

చ॥గు—అమ్మా! వాని మన్నింపుము.

ముర—మన్నింపనా? వేయితేళ్ళొక్కపెట్టున గుట్టి నట్లు నాహృదయమును వేధించు పరాభవజ్వాలను జల్లార్ప గలది నందుని రక్తమొక్కటియే.

చ॥గు—తల్లీ! నేను బాల్యమున వానితో నెన్ని సారు లాడుకొనలేదు? వాని కెన్ని యాటవస్తువుల దెచ్చి యీయ లేదు? నిన్నడిగి మధురపదార్థముల గొనిపోయి, సగ మిచ్చి వాని కిన్కదీర్చి, యీచేతులతో నాడింపలేదు? తండ్రి గారు కోపపడిన వాడేన్నుతరి వానికన్నీటినార్చి ముద్దుగొన లేదు? ఒకనాడు గుఱ్ఱమొకటి కట్టుద్రాళ్ళు తెంచి వీధుల యందు పరువులిడుచుండ నందుడా మార్గమున నుంటజూచి, వాని నెత్తి, యొడలుదుడిచి, యురమునదమి, గుఱ్ఱముతన్నిన దెబ్బను నేనుతిని, నందుని కెట్టియాపదయు లేకుండ జేసితిని. నేటి యుద్ధమున తరుణలావణ్యసదనమగు నాతనిముఖము కనబడినతోడనే వెనుకటి వృత్తాంతములన్నియు స్మృతికివచ్చి వానినెత్తిపై కత్తినెత్తుసరికి పైత్రృకంబగు రక్తముద్యత్మై హృత్పిండమునకుబెకి, తత్పంజరద్వారమునుతట్టి, "చంద్రగుప్తా! ఆగు మాగుము, వీడు నీతమ్ముడు, మగధసామ్రాజ్యము నీకు నమ్మలిచ్చిన నెక్కుడా?" అని అడిగినట్లయ్యె. ఇంక నే మెటులాడుదు?

ముర—నందుడు నీకు తమ్ముడా? నాకేమగును?

చ॥గు—నందుడు నీకు పోష్యపుత్రకుడు. వాని నీవు గర్భమున ధరింపనంతమాత్రమున నాతడు నీకుకొడుకుకాడా?

అతని తల్లి గతించినపిమ్మట నీవాతనికి మాతృకల్పవై పెంచ లేదా? నాతో సమానముగ బాలీయలేదా? భుజముపై నెచికొని యూశింపలేదా? ఇంతలోననే వాని మరచితివా? అమ్మా!

మురి—అందుననే నేనతని క్షమింపజాలను. ఆకథ నంతయు నందుడు మరువగల్గెను, మరచెను. కాని మనము మరు వజాలకున్నాము. అధముడగు వాచాలుడు నాకొప్పనట్టి యీ యావ్వచుండ నందుడు నవ్వుచూ "శూద్రస్త్రీ"యని హేళనము చేసి నన్నన్నమాట లేమని చెప్పుదును? అయ్యో! అయ్యో! మాతకు జరిగిన యవమానము బద్ధమైన నీమనమున నాటుట లేదా? నేను నీ కేమియు గానా? నన్ను నీకు లేనిదానిగ జేసితినా?

చాణ—చంద్రగుప్తా! ఒకతల్లియుదరమున జనించి నను కదా సోదరులగుట. నందుడు నీకు సోదరుడే యను కొమ్ము. అట్లయ్యు తల్లిమొక్కుడా? ఆమొగర్భమున జనించిన సోదరుడెక్కుడా? తల్లికి ఘటిల్లిన పరాభవమునకు గుమారుడు బదులుసేయ నెంచకుండుటకు బ్రపంచమున నీవే ప్రథ మోదాహరణము. దౌర్భాగ్యురాలా! మురా! అమరణము నీవేడువవలసినదే. నీసుతుడే నిన్ను మరచెను. నీకుసంభవించిన మహావమానమునకు బ్రతీకారము సేయుటకు నీతనయుడే వెనుదీయుచున్నాడు. ఇక నీకు దిక్కెవ్వరు?... చంద్రగుప్తా తల్లియన నేమనుకొంటివి? తల్లికి పిల్లలకు నొకటేరక్తము,

వేయుము. ఏమి ఊరకుంటివి? చంద్రగుప్తా! నేను నీతల్లిని, మహావమానమునకు, ప్రపీడకు, క్రూరపదాఘాతమునకూ భాజనురాల నగుమాతను: నాయానయిది, ఇక నీచిత్తము.

చ॥గు॥—అమ్మా! నీ కేది యిష్టమో నాకు నదియే యిష్టము, ఇందు నేను లేదు. ప్రశ్నసంకులమగు నీకుటిల ప్రపంచమున నాకు మార్గదర్శకురాలవునీవు. ఈసంసారసాగరమున నాజీవనపోతము గడుప నిన్నే కృపతారగా భావించుచున్నాను, నన్నాశీర్వదించి పంపుము. ఇదే యుద్ధభూమికి బోవుచున్నాను.

మురా—ఇప్పుడు నిజముగా నాకుమారుడవైతివి.

చాణ—ఇప్పుడు నాశిష్యుడ వనిపించుకొంటివి- ఈ క్షణికావసాదమును నీచిత్తమునుండి తొలగించి—ఒకసారి బలపూర్వక—

(తెరలో ఈవైపు... ఈవైపు)

అదే వారు వచ్చుచున్నారు. ఇచ్చటికేవచ్చిరి, వత్సా, లెమ్ము. మేఘనిర్ముక్త ప్రచండభాస్కరునివలెది ద్విగుణిత తేజమున ప్రకాశింపుము. ఆ నరసింహధ్వని వినుము- నీ సేనగూడ వచ్చినది, భయము వలదు: ఒక చంద్రగుప్తుడు నూర్గురు నందులకు సమానము. నాశిష్యుని జయింపజాలు సామర్థ్య మెవరికి గలదు? చంద్రకేతు సేనాసహితుడై నీకు సాయముచేయ వచ్చుచున్నాడు. చంద్రగుప్తా! దృఢమనస్కుడవు గమ్ము-మురా, రమ్ము, కుమారా, పొమ్ము-నీకు జయ

మగుగాక! (వెళ్ళుదురు)



(నందుడు కొందరితో వచ్చి)

నంద — ఓరీ పిరికిపందా! ఇక్కడనా దాగియుంటివి?

చంద్ర — నందా! కాచుకొనుము (కత్తినెత్తి) ఏమిది? చేయి వడకుచున్నది?

[యుద్ధము జరుగును. కొందరు భూమిపై వ్రాలుదురు. చంద్రగుప్తుడు నందుని జంపబోగా నతడు చేతులు జోడించి "శరణు, శరణు" అని వేడుకొనును. చంద్రగుప్తుడు కత్తి నిపారవైచి నందుని కౌగలించుకొన బోగా, నిద్దరు భటులు చంద్రగుప్తుని జంప గమకింప, చంద్రకేతు వడ్డుపడును. మరియిద్దరు చంద్రగుప్తుని జంపబోవ ఛాయ వారి నంతమొందించును. చంద్రగుప్తుడు స్మితవదనుడై ఛాయను గాంచును.]






## మూడవ అంకము.

---

### మొదటి రంగము

(నందుడు వాచాలుడు చెరలో)

నంద — అబ్బా! ఈగదిలో నెంతగాఢాంధకారము!

వాచా — కానిమ్ము — దోమలబాధ తీరినది, దొంగ భయము లేదు.

నంద — కాత్యాయనుని నేను బందిలోనుంచిన దీ గది లోనే కాబోలు ?

వాచా — ఔను, మహారాజా !

నంద — అబ్బా! ఎంతభీకరముగా నున్నది !

వాచా — ఇందే యతని యేడ్గురుసుతులకన్నము పెట్టక మాడ్చి చంపితివి.

నంద — అందుకు దగిన ప్రతిఫలము ముట్టినది.

వాచా — ముట్టినదా! ముప్పా నప్పును తీరినవి. ఇక భయమేల?

నంద — అదెట్లు? చంద్రగుప్తుడు నన్ను వధింపడనుట సత్యము. వధించినచో శీర్ణుడు భ్రుకుటీకుటిలుడు, ప్రతి

హింసాపరాయణుడునగు నా బ్రాహ్మణుడే. ఆనా డతడు నావైపు ఆకొన్నసింగంబు గున్నకన్నను వీక్షించుభాతి లోలుపదృష్టుల జూచెను.

వాచా—భయమేల?

నంద—నీకు భీతిలేదా?

వాచా—లేశమైన లేదు. ఎంతకోపమున్న వారు నిన్నుజంపుదురు. అంతకన్న నెక్కుడు సేయజాలరు. నాకు భయమేల? నాచెల్లెలు ముండమోయును. నాకేమి?

నంద—వారు నన్నుజంపి నిన్ను విడుతురనియా నీయూహ?

వాచా—ఇది నిశ్చయమే.

నంద—అట్లనుకొనకుము.

వాచా—ఆ ?

నంద—నీవు చంద్రగుప్తునితల్లిని కొప్పువట్టి యీడ్వ లేదా?

వాచా—ఈడ్చితినా? ఎప్పుడు?

నంద—చాణిక్య పండితుని మెడబట్టి గెంటితివా, లేదా?

వాచా—ఎప్పుడు? లేదే?

నంద—పైపెచ్చు నీవు నాకు స్యాలకుడవు.

వాచా—నిజమే.

నంద—ఒకవేళ నన్ను విడిచిన విడుతురేమో కాని నిన్ను విడువరు.

వాచా—(చేతులుజోడించి) మహారాజా! రక్షించుము.

నంద—నా కేల కేలుమోడ్చెదవు ?

వాచా—ఇది యలవాటు- కాని నే నేమెరుగను.

నంద—భయమేల? చంపుట తప్పదు.

వాచా—ఎవరిని? ఎందుకు?

నంద—"ఎంతకోపమున్న వారు నిన్ను జంపుదు"రని నీవే యంటివికదా!

వాచా—అంటినా? నాకు జ్ఞప్తిలేదు.

నంద—నీస్మృతిశక్తి నీవశమందున్నది. కొన్ని జ్ఞాపకముండును. కొన్ని జ్ఞాపక ముండవు, నీవిప్పు డంటివే?

వాచా—అనియుంటినేమో కాని నాయభిప్రాయమదికాదు.

నంద—వారు నిన్ను తప్పక చంపుదురు.

వాచా—వలదు, వలదు, మహారాజా!

నంద—నిన్ను తప్పక వధింతురు.

వాచా—ముండమోయు నయ్యా!

నంద—నీకు భార్యలేదే? ముండమోయున దెవతే?

వాచా—అయ్యో! ముండమోయుట కొకభార్యయైన లేకపోయెగా దైవమా!

నంద—నీకొర కేడ్చువారునూలేరు.

వాచా—భార్యయుండిన నేడ్చునుకదా? ఇప్పు డెవరునూలేరు.

నంద—ఇట్టి యాసన్న మృత్యుదశయందును నీపరి యాచకమునకు నాకు నవ్వువచ్చుచున్నది.

వాచా—దీని జ్ఞప్తియందుంచుకొనెదను. నవ్వువచ్చుచున్నది. నవ్వు వచ్చుచున్నది.

నంద—యుద్ధమునకుబూర్వము మహారాక్షసి బుత్రుసీ మంత్రిసమాశ్రయమున వీడి వచ్చితివా ?

వాచా—ఆహా? విడిచి వచ్చితిని. (ధ్వనియగును)

నంద—ఆధ్వనియేమి ? వాచాలా !

వాచా—ఎవరో వచ్చునట్లున్నది, తలుపు దీసిరి.

(కాత్యాయనుడు వచ్చును)

కాత్యా—మహారాజా ! కుశలమా ?

నంద—విశ్వాసఘాతకుడా ! నీవు మంత్రివా ?

కాత్యా—నేను విశ్వాసఘాతకుడనా?

నంద—ఆబాల్యము మా యన్నముదిని-

కాత్యా—నీతండ్రి చంద్రగుప్తునికిగూడ తండ్రియే. మహారాజా! నీతండ్రికి విరుద్ధమగుకార్యము నేను చేయలేదు-వానిపుత్రులలో నొకనిపక్షమువీడి యన్యునిపక్ష మవలంబించితిని, రాజద్రోహి నెట్లాదును?

నంద—ఓహో! మాదాసీపుత్రుని పక్షమవలంబించి, మాపక్షమవలంబించితిసని యెంచుచుంటివా? బ్రాహ్మణుడా నీకు సిగ్గేలలేదు ? నీవును చాణక్యుడును బ్రాహ్మణులయ్యు, కుట్రనుబన్ని, యనార్యమగు భిల్లసేన గూర్చుకొని, క్షత్రి

యునిసింహాసనమునుండి తొలంగించి, దాసీపుత్రు నందాసీను నిగ జేసితిరి! ఒకశూద్రుడు, కులాంగారపుత్రుడు, నేడు మగధసింహాసనము నధిష్ఠించెనా! ఏమి విధివిలసితము! ఇదేనా మీ ఖ్యాతి?...ఏమి? తలవంచెదవేల? కృతఘ్నుడా?

కాత్యా—నందా! నేనెన్నటికినీ కృతఘ్నుడగాను. నీవే నన్ను విశ్వాసఘాతకునిగ జేసితివి. అమాయికులగు నాసుతుల నేడ్వుర చెరంద్రోసి చంపితివి. నాకన్నులతో నేను— వారు— ఈగదిలో— ఈయంధకారమున— ఆకలిచే శుష్కించి చచ్చుచుండగా, ననహాయుడనై చూడవలసివచ్చెను! నాసుతు లెల్లుమరణించునపుడు నీవొసగిన పిడికెడాహారము నాకిచ్చి దేహములు వాలించిరి. చచ్చుటకుముందు వారు నిన్నుశపించుచూ నాతో "తండ్రీ! యీయత్యాచారమునకు ప్రతీకారము నీవు తప్పక యొనర్పవలయు" ననిరి. అట్టి సుతులగూర్చి జనకున కెట్టివ్యథయుండునో నీ కేమి తెలియును? గాఢాంధకారమున నీసంసారము లుప్తమగునప్పుడు కొడుకులే కదా తండ్రికి పట్టుగొమ్మలు. మానవునికీర్తి, యపకీర్తి, సంపద దారిద్ర్యము, పుణ్యము, పాపము మొదలగువానికి హేతువులు కుమారులే. తండ్రికి సర్వస్వమూ పుత్రులే. అట్టి నా పుత్రుల నేడ్వుర నీకడుపున బెట్టుకొంటివి. నాభవిష్యత్తును శూన్యమైన రాజ్యముగ జేసి నాహృదయమున నాధిపుట్టించి నా జీవితమును హాహాకారపరిణతమునుగునట్లు చేసితివి. వారందరు నీతో నాడుకొనువారు కదా, నీ కేమి యపకార మొనర్చిరి?

నంద—బ్రాహ్మణోత్తమా! నే నన్యాయము జేసితిని. ఘోరమగు ఘాత యొనర్చితిని. సహజముగా నేను పాపిని గాను. కాని నాగదోషమున జెడితిని, సైరింపుము.

కాత్యా—మహారాజా! నీవింత నిష్ఠురుడ వెట్లైతివి? నాకన్నులయెదుట బుట్టి పెరిగి పెద్దవాడ వైతివే, నిన్ను నాతొడ యందుంచుకొని భుజముపై నెత్తుకొని యాడించితిని; నాయెడ నీ కింత నిష్ఠురత యెట్లు సమకూరెను?

నంద—బ్రాహ్మణోత్తమా! నన్ను క్షమింప వేడుచున్నాను.

కాత్యా—రాజా! క్షమింతును, పిదప సంసారమును త్యజించి సన్యాసి నయ్యెదను.

వాచా—ఆ పని యత్యుత్తమము. ఈ సంసారమున జగడములు మెండూ, సుఖమునున్న; ఇందుండకపోవుటయే మంచిది. అట్లయిన మేమును ముక్తులమయ్యెదము.

కాత్యా—మిమ్ము ముక్తులజేయుటకు నాకధికారము లేదు. చాణక్యమంత్రిని వేడుకొనవలయును.

నంద—ఆ బక్కపేగుల పారుడు మంత్రియా?

కాత్యా—అంతేకాదు. చంద్రగుప్త మహారాజునకు గురువు.

నంద—శూద్రుడగు చంద్రగుప్తుడు-రాజు-, భిక్షుకుడగు చాణక్యుడు-మంత్రి, మరి సేనాధిపతియో?

కాత్యా—మలయరాజగు చంద్రకేతు.

నంద — సరిపోయినది. వారిజోలి నా కేల? నీయెడ నే నపరాధ మొనర్చితిని, నన్ను క్షమింప వేడెదను. ఇందు ముందువెనుక లారయ నక్కరలేదు. ఇది నాకు లజ్జాకరము కాదు. కాని శూద్రుడగు చంద్రగుప్తుని, వాని తల్లియు మా దాసీయునగు మురను దలచుకొనిన నా కొడలు మండును. ఈ చెర వీడెనా?

కాత్యా — నీ చెర గొప్పుటకు వారి నెంతయు బతిమాలెద.

వాచా — అయ్యా, నన్ను గూర్చి కూడ కొంచెము వేడుకొనుము.

కాత్యా — వాచాలా! నీవు స్వయముగా వారిని వేడుకొనవచ్చును. నిన్ను బిలువ చాణక్యుడు నన్నంపెను.

వాచా — అయ్యో! దైవమా!

కాత్యా — వాచాలా! నిన్ను వారియొద్దకుం కొని పోవుటకే నారాక.

నంద — వీనితో వాని కేమిపని?

కాత్యా — అది నాకు తెలియదు. వాచాలా! పోవుదము రమ్ము.

వాచా — మహారాజా!

నంద — ఓయీ! నన్నేమిసేయుమందువు? నేనుగూడ నీవంటివాడనే. పొమ్ము.

కాత్యా — రమ్ము- భయములేదు.

వాచా—విడుచుటకన్న ధైర్యమును లేదు.

కాత్యా—రా! రమ్మన్న.

వాచా—రాక తప్పదా? నడువుము. (పోవుదురు)

నంద—దాసీపుత్త్రుడు నాసింహాసనమెక్కెనా? ఈ చెఱనుండి విముక్తి కానిమ్ము, వానిపని బట్టెదను.

---

రెండవ రంగము.

—:•:—

చాణక్యుని కుటీరము.

చాణ—వెనుకంజ వేయనా? ఎటూ? ఎక్కడకు బోవుదు? నిశ్చింతాలసభావముకా? నిష్కర్మనై రాజ్యము నకా? కాదు కాదు. అందు సారస్యమేది? అది కడు నస హ్యము. అంతకన్న నిదియే మేలు. ఇందు ప్రతిహింసాజ్వాల కలదు, ఉత్తేజనజనితోన్మాదము గలదు. దొరికిన స్వర్గము, లేకున్న నరకము...ఆ! నరకమున కేలబోవలయు? ఔను. స్వర్గమునకు నేబోగూడదని బ్రహ్మ నానుదుటవ్రాసెనా నర కమేగతి. ధాతా! నన్ను నీచెంత జేరనీయవేని నీప్రతిపక్షు లలో జేరి నీనల్లగుండెలో నిద్రపోవుదును. నీచిత్తమువచ్చినరీతి నొనరింపుము--నాపూనిక వీడువాడనుగాను...ఓసీ! పిశాచీ! నీయక్షయబీభత్ససౌందర్యము నామనము నరికట్టినది. ఓ అదృశ్యమహాశక్తి! నీచేతిలో నాచేయివేసితిని, నిన్ను వలచితిని, నీవిషాక్తోపగూహమున వక్షమూని నీయధరవిషపాన ము నర్చి యమరుడనైతి, నరకమునకు బోవ సిద్ధుడను-ప్రేయసీ!

నన్నువీడక, నీవెంట దోడ్కొనిపొమ్ము; ఎట్లైననూ సరియే; పాపరచితమగు నీశవచము నోసంగుము. దానిధరించి నన్నీ ధాత యేమిసేయగలడో చూచెదను.

(కాత్యాయన వాచాలులు వత్తురు)

కాత్యాయనా! వీడెవడు?

కాత్యా—నందుని స్యాలకుడు వాచాలుడు.

చాణ—ఓహో! (వాచాలుడు (మొక్కు) అబ్బో! ఏమిభక్తి! ఆనాడు నామెడబట్టి గెంటితివి, జుట్టుపట్టి యీడ్చితివి. జ్ఞప్తియున్నదా?

వాచా—ఎప్పుడు? లేదే! (వెనుక జూచును)

చాణ—ఓహో! మరచితివి కాబోలు. నేను జ్ఞాపకముచేసెదను... దానికేమి? ముందు నందునికుటుంబ మెందున్నదో తెల్పుము.

వాచా—నే నెఱుగను.

చాణ—నీకు తెలియును, చెప్పుము.

వాచా—ఆ! ఆ! ఎఱుగుదును.

చాణ—ఎక్కడ నున్నది?

వాచా—(క్రిందు మీదు జూచును)

చాణ—అట్లు జూచెద వేల? నందునికుటుంబ మెట నున్నది! నీచెల్లెలూ మేనల్లుడు నెచటనున్నారు? చెప్పవేమి?

వాచా—మలయపర్వత దుర్గమున.

చాణ—అక్కడలేరు, అసత్యము.

వాచా—అబద్ధమే, అక్కడలేరు.

చాణ—ఎటనున్నారో చెప్పుము, పారితోషిక మిచ్చెదను.

వాచా—వారి పుట్టింట.

చాణ—కాత్యాయనా! అటకొక సేననంపుము, అంతవరకు వీని జెరలోనుంచుము; వారు దొరికినచో వీని ముక్తునిజేసెదను, లేదా, వీనిప్రాణములు తీయుదును.

కాత్యా—వాచాలా! రమ్ము.

వాచా—ప్రా-ణ-ము-లు-తీయుదురా?

చాణ—అవశ్యము! అది తప్పదు.

వాచా—మాచెల్లెలక్కడ లేదు.

చాణ—ఓరీ! నీవు నల్లత్రాచుతో నాటలాడుచున్నావు. నిజము చెప్పుము.

వాచా—ప్రమాణముచేసి—

చాణ—నిజము చెప్పుము. నిన్నేమియూ చేయను. నందునిభార్య ఎక్కడ నున్నది?

వాచా—మంత్రియింటిలో—

చాణ—(ఆలోచించి) ఆ! ఈమాట నిజము కావచ్చును. ఎవరక్కడ? (భటుడు వచ్చును) వీని జెరలో నుంచుడు, వీడు చెప్పినది నిక్కమైనచో వీనికి బంధమోచనము జేసెద? లేకున్న మృతిదప్పదు.

వాచా—నాలుక యెండుచున్నది. నీరు కావలయును.

చాణ—లోనికి బొమ్ము....భగవత్సృష్టి యందు వ్యర్థపదార్థము లేదు. చెత్తకుప్పయందును చేవయుండును. దుర్గంధదూషితములగు మలమూత్రములనుండి సువాసన ద్రవ్యములు వెలువడుటలేదా? ఇంకను దెలిసికొనదగు విష యము లనేకములు గలవు...ఏమి ఆలోచించుచుంటివి? కాత్యాయనా!

కాత్యా—నరు డింతనీచు డగునా యని చింతించు చుంటి. అత్యాచారము, పీడనమూ హత్య మొదలగువాటిని సహింపవచ్చును, కాని ఇట్టికృతఘ్నత నిర్భరము; అసహ్యము.

చాణ—నరు డిట్టికృతఘ్నుడు కావుననే చాణక్యనీతికి చోటుకల్గెను. పురుషుని కదర్యప్రవృత్తిమూలముననే నాకా ర్యముల సాధించుచుండెదను. ప్రాణమిత్రుల శత్రువుల జేయుట, సహోదరు లన్యోన్యము కుత్తుకల నుత్తరించుకొను నట్లు చేయుట, హింసను రేపుట, లిప్సాగ్ని కింధనము గూర్చుట, దీని పేరే చాణక్యనీతి-కత్తిని కుత్తుకలో గ్రుచ్చు నపుడు ముఖమున మందస్మితము తొలుకాడుచుండవలయు, పానీయమున విషమునిడు వేళల మధుగానపముల మోహము పుట్టించవలయును. దీనికే చాణక్యనీతి యనిపేరు. "జయింపవలయును శత్రునిపై శాఠ్యమెందు"

కాత్యా—పండితోత్తమా! ప్రతిహింసాసముద్రమున మున్గి నేనునూజగుప్సాంధకారమున మగ్నుడనై యుంటిగాని నీరాజనీతివైఖరి నాకు దురవగాహముగా నున్నది!

చాణ—అంతయు నచిరకాలమున గ్రహింపజాలుదువు, ఓపికబట్టుము; నిన్నుసంపూర్ణవిశ్వాసఘాతకునిగ జేసి విడిచెదను. ఈశాస్త్ర్యమును యథావిధానముగా నేనభ్యసించుచున్నాను-నీకు నుపదేశించెద తాళుము.

కాత్యా—కాని యిదిమాత్ర మన్యాయము. పాణిని "నిర్వాణో వాతే" అనుసూత్రమును—.

చాణ—అబ్బబ్బ! ఇంకను పాణిని యనుచుంటివా? దీని నన్యాయ మనువారెవరు?

కాత్యా—సంఘము.

చాణ—దాని నేను లెక్క సేయను.

కాత్యా—వివేకము.

చాణ—వివేకమా! అది కుతర్కము, కుసంస్కారము.

కాత్యా—భగవంతుడు.

చాణ—భగవంతుడే లేడు.

కాత్యా—రామ రామ! అయ్యా! మీరొకపర్వతశిఖరాంచలమున వ్రేలాడుచున్నారు. జారిపడెదరు సుడీ!

చాణ—అట్లైన ప్రచండోల్కాపాతము ఘటిల్లును. దానిని జగమంతయు విస్మయముచే నడలి చూచును. నాకు నిద్రాసమయమైనది, నేబోయెద; కాత్యాయనా, రేపుసిద్ధము జేయుము.

కాత్యా—దేనిని?

చాణ—యూపకాష్ఠము, ఖడ్గమును. బలినొసంగుటను గూర్చి యాలోచింప నవసరము లేదు, అది సిద్ధమే.

కాత్యా—నాదొక మనవి. నందుని విముక్తుని జేయ వేడెదను.

చాణ—అసంగతము. నీవుపోయి యంతయూసిద్ధము జేయుము. చూడు! నాప్రేయసి స్మితవదనయై యెట్లుచూచు చున్నదో—(పోమ్ము)

ఓసీ! అదృశ్యమహాశక్తీ! నన్నింతదనుక నీడ్చి తెచ్చితివి. నీప్రేమప్రవాహమున కొట్టుకొని వచ్చితిని. నీకుటిల దృష్టి, వికటహాసము, వక్రగతి, పూతిగంధము, మలినస్పర్శ మును—ఎంతయుమనోహరములు! ప్రేయసీ! నీవింత కుత్సితురాలవా? నిన్నుజూచునప్పుడెల్ల మోహము నన్నావరించు చుండును. నీప్రభచే నల్లనిదావానల ముత్సర్గమై బ్రహ్మాండ మండలి సౌందర్యమెల్ల ద్రిమ్మరుచున్నది. అరణ్యమునందలి క్రూరశార్దూలములు "సర్వాంగములుంజలింప బెగడొందుచు దిక్కులుచూచు చున్న సారంగి" గముల నోటవేసుకొనుటకు తీవ్రదృష్టుల నిగిడించుచున్నవి. ఓహో! ఎంతభయావహము! ఎంతసుందరము!

—————

మూడవ రంగము

---

గాంధార రాజప్రాసాదము—సెల్యూకసు, కూతురును ప్రవేశింతురు.

సెల్యూ—ఈసారి సికందరుపాదిగ్విజయము పూర్తి జేసెదను. చంద్రగుప్తా! భారతవర్షమున నతిప్రయాసపూర్వకముగ స్థాపింపబడిన యవనోపనివేశము నొకవత్సరమునకే నిర్మూలించితివికదా! ఈసారి దానికి ప్రతిక్రియ గావించెద జూడుము.

హెలె—భారతవర్షమును జయింపబోయెదవా? జనకా! ఆసియార్ధఖండమున నీసామ్రాజ్యము వెల్గుచున్నది. నీయశము పృథ్వియందంతట వ్యాపించి యున్నది. ఐననూ సింధుభూముల నేపోరులేక పాలించుచుండిన చంద్రగుప్తుడు నీకు కంటిలోనినలుసాయెగా?

సెల్యూ—భారతీయుడు రాజ్యమేలుటయా? వాడేమి యవనుడా?

హెలె—ఏమీ! అతడు మానవుడు గాడా?

సెల్యూ—ఈప్రపంచమున రెండేజాతులు, యవనులమగు మేము, తక్కిన వారు బర్బరులు. మేము రాజ్యమేల నర్హులము. వారు కారు. ఇది నామతము.

హెలె—యవనులే సర్వకాలములయందును విశ్వవిజయులైయుండలేదు, ఆచంద్రార్కము వారే విశ్వవిజయులుగానుండువారు కారు; వారి ప్రభావసూర్యుడస్తమింపనున్నాడు.

ఆసన్ననిర్వాణమున దశాంతమునొందిన వారిప్రతాపదీప మి ప్పుడు నీరూపమున వెలుగుచున్నది. ఇంక నదియు హరించుకాల మాసన్నమైనదికాబోలు? నీకు పరాజయము సిద్ధము.

సెల్యూ—ఏమీ! యవనసామ్రాజ్యము హరించునా? జయావతారుడగు సెల్యూకసునకు బరాజయమా! ఆతడు బ్రతికియుండ యవనప్రతాపసూర్యుడ స్తమించునా? అసం భవము-

హెలె—నామాట లాలింపుము. సికందరుషా సింధు భూములపై దండెత్తునాడు భారతరాజు లన్యోన్యద్వేషులై యుండిరి. కావున నాఛిద్రము కనిపట్టి మీరుజయము పొంద గల్గితిరి. నేడన్ననో, వారందఱు నేకఛత్రాధిపత్యము వహించి యున్న చంద్రగుప్తునికి సామంతులై ఐకమత్యమున మిత్ర భావము నూనియున్నారు. మరియు లోగడ భారతవీరులకు. మీయుద్ధమర్మములు తెలియవు. ధైర్యమున, వీర్యమున, సాహసమున, బలమునావారు మీకు దీసిపోకున్నను సామరిక ప్రథల మీవలె నెరుగరు. కావున సుశిక్షితులగు మీయవన వీరులకు లొంగిరి. ఇప్పుడో వారు మీయుద్ధమర్మముల నెరుగుదురు. దేశము వారిది, వస్తుసమృద్ధిగలదు, కావున మీకుజయముదుర్ఘటము, అపజయమునకు దోడవమానము సిద్ధము, బందీకృతులగుదురు. అదితప్పదు.

సెల్యూ—ఏమీ? మమ్ము చెరయందుంపగల సమర్థు

దుండునా? నీవు మాకొక గొప్ప శ్రేయోభిలాషిణివలె గన్పట్టుచున్నావు!

హెలె—కావుననే అప్రియమైనను తథ్యమును బల్కుచున్నాను. మీరన్యాయమున కొడిగట్టుచున్నారు, ధర్మమెచట నుండునో జయము నచటనుండును.

సెల్యూ—యుద్ధవిషయముల నీతో చర్చింప దలచుకొనలేదు. ఆరిస్టాఫేన్సు చెప్పినట్లు--

హెలె—అత డేమనెను?

సెల్యూ—స్త్రీలతో నావిషయము చర్చింపరాదని.

హెలె—ఏదీ వాని గ్రంథముల దెచ్చెద- అట్లెచట నున్నదో చూపుము.

సెల్యూ—అతడుకాడు- తెమిస్టాక్లీసు.

హెలె—అతడు రాజనీతికోవిదుడు గాన నట్లెన్నడును వ్రాయడు.

సెల్యూ—ఆ! అతడుకాకున్న సోఫోక్లీసు కాబోలు.

హెలె—అటులనా? వాని గ్రంథములే తెచ్చెద, ఆతడట్లెచట వ్రాసెనో చూపుము. (పోవును)

సెల్యూ—బుద్ధి గడ్డితిన్నది. ఇప్పుడు నేను చెప్పిన గ్రంథకర్తలెవరునూనాకు కృతపరిచయులు గారు. వారి గ్రంథములే నేనెరుగను. ఇది కేవలము నాయభిప్రాయమే. గొప్పవా రిట్లనిరనినచో బలవత్తరమగునని కుయుక్తి జేసితిని. ఈమె యా గ్రంథములనెల్ల కూలంకషముగ జదివినది. యవనసారస్వ

తము చాలక సంస్కృత మిప్పు డభ్యసించుచున్నది. ఇంకనీమె రాగలదు. ఇక్కడనుండి పరుగెత్తుటయే శ్రేయము. (పోవును)

(పుస్తకములతో హెలెక్ వచ్చును)

హెలె—ఓహో! ఆతడిక్కడ లేడు. పారిపోయిన నే వీడుదాన గాను, ఎచ్చట నట్లుదహరింపబడినదో చూపవలయు ను. ఊరక స్త్రీల నవమానించిన నొప్పను.

(పోయితండ్రిని తీసికొనివచ్చును)

(కూర్చుండి) పోపోక్లీ సామాట నెచ్చటను వ్రాసియుండలేదు. ఉన్నచో జూపుము.

సెల్యూ—ఏమి యీబలవంతము? నేను చూపను, పొమ్ము. నీవేమి చేసెదవు?

హెలె—ఆమాట యెచటనున్నదో చూపుము. ఊరక నాథువారిని జుల్కన సేయజూచిన నేనొప్పుకొనను.

సెల్యూ—నాయిష్టము. నీవసాధ్యపుపిల్ల వగుచున్నావు, నీదుడుకుదనమునకు మేరలేకయున్నది. నాయందు నీకభిమా నము లేదు.

హెలె—తండ్రీ! నీవట్లన జెల్లునా? నీకంట నొల్కు చున్న బాష్పబిందువు గాంచుటకు నాసర్వస్వము ధారవో యుదునే.

సెల్యూ—అమ్మా! తప్పాడితి; నన్ను మన్నింపుము.

హెలె—కాదుకాదు. అపరాధమునాది. నీయందు నాకు ప్రేమలేదు, నీవే నన్ను క్షమింపుము.

సెల్యూ——అభిమానము నీకు లేకేమి? కోపోద్రేకమున నట్లంటిని.

హెలె——సోఫోక్లీ నావిషయమున నేమనెను?

సెల్యూ——ఏమియు ననలేదు. ఊరక నే నంటిని.

హెలె——అట్లయిన నీ తోడ నాకు వివాదమే లేదు. సికందరుషా విషయమున నొకమాటవింటిని, అదినిజమగునా?

సెల్యూ——ఏమాట?

హెలె——ఆతడు భారతవర్షమును జయింప బోవునప్పుడొక బ్రాహ్మణుడు డాతనికెదురుగ వచ్చి, "సార్వభౌమా! భారతవర్ష విజయానంతరమే దేశము జయింప నెంచితివ" న, "చీనాదేశము" ననియుత్తరమిచ్చెనట. "పిమ్మటనో?" అనియడుగ "నైరోపాఖండము గెల్చెద" ననియు, "ఆవెనుకనో?" యన నేమియు చెప్పజాలక సార్వభౌముడు "అప్పుడొక గొప్ప విందును జేయుదును" అనగా ఆ బ్రాహ్మణుడు నవ్వి "ఆవిందిప్పుడే సేయరాదా?" అనియడిగెను.

సెల్యూ——ఆబ్రాహ్మణుడు నిండు పిచ్చివాని వలె నున్నాడు.

హెలె——కాదుకాదు. అతడు గొప్పతత్వజ్ఞుడు, మనుష్యునియాశకంతములేదని చూపుటకట్లొనర్చెను. డయోజనీసొక్కడే ఆశావాగురుల చిక్కక తాను జీవించుటకు మాత్రమావశ్యకమగు వస్తుసంచయముతోడనే తృప్తినొందుచు నొక తొట్టెలో గూర్చుండెనట.

యుపేక్షగూడునా? చంద్రకేతూ నీవును మాటలాడుచుండ నేనువచ్చితినా, తక్షణమే నీవటనుండి తొలగు చుందువేల? ఇంత యుదాసీనత నీకు గూడునా?

ఛాయ— ఉపేక్షయు నుదాసీనతయునా? మీరెన్నడైన బర్వతశిఖరమునసనిల్చి సూర్యోదయమును వీక్షించితిరా? దిగంతవిశ్రాంతపర్వత శ్రేణులపై ప్రభాకర కిరణప్రవాహము క్రీడించుట గంటిరా?

చ॥గు— చూచియుండ కేమి?

ఛాయ— మూంజపత పుట్టెడి. ఉజ్వలఘనశ్యామలమగు లత యావేగమున ప్రకంపితమగుచుండుట కొండచరియలలో నుండువారి కెట్లుగుక పడును?

చ॥గు— ఇందు చేతనే కాబోలు నీయంతరంగము నే నెఱుంగ లేకుంటిని. ఆహా! మీ ఘనశ్యామావరణమున హృదయ ముండుట నెఱుంగుదును.

ఛాయ— ఆహా! ఏమి మహారాజుగారి సౌజన్యము! నల్లని దేహ మునవాల్లకి ఘనశ్యామావరణ మనుచున్నారు. మేఘ మెంత శ్యామలముగనున్న నంతజీవన సమృద్ధమని ప్రభువు లెఱుంగరా? దానియంతరమున తేజఃపుంజమగు మెఱుపు కేళిసల్పుచుండదా? మాకు హృదయముండునని మీ రెఱుంగుదు రంతియచాలును. అది యెట్టిదో, దానియం దెట్టిభావ ప్రవాహము లుత్పన్నములగునో యెఱుగుదురా?

చ॥గు॥—అటులనా? ఛాయా! నీవు నాపై వలపుగొంటి వా? ఇది సంభవమా?

ఛాయ—సంభవము కాకేమి? ఈశ్వరుడు మీశరీరమున సువర్ణ మధికముగ గల్పెను. అందుచే మీరహంకారపరవశులై భూమిపై యడుగైన బెట్టరు. నన్ను వలచితివా? అని యడుగుచున్నారా! మిమ్ముజూచి నాకు జాలిపొడముచున్నది. నేను బిచ్చకత్తెవలె మిమ్ము ప్రేమభిక్షు పెట్టుడని యాచింతు ననుకొంటిరా? నిరూపూర్వకముగ మీరు రవ్వంతబిచ్చము పెట్టిన దానిని నేను చేతులుజోడించి చేకొందు ననుకొంటిరా? మహారాజా, నేనెంత యసభ్యురాలనగు కొండెదానినైనను, ఎంతకల్లరిదాననైనను, మిమ్ముజూడనాయొడలుమండుచున్నది. ...(పోవును.)

చ॥ గు॥—ఏమియీవాగ్ధోరణి! ప్రాణరక్షణ సల్పిన బాలామణి యిట్టు లేవగించునా? నారీచిత్త మతిదురవగాహ్యము, దానినెరుగ ధాతకైన వశముగాదు. మున్నొకనాడు సింధునదీతీరమున సికందరుపాసముతీమున సెల్యూకసుప్రాణమును నే గాచునప్పుడు వానికూతురు సజలదృష్టుల నాపై నారించె, అది ప్రేమయా? లేక కేవలకృతజ్ఞతయా? ఆహా! ఆయువనకాంత యెంతసుందరి! మహాసముద్రనీలజలములపై నవతరించినయుషఃకాంతభాతి, రక్తవర్ణజపాపుష్పరాశిమధ్యమున రాజిలు దరవికసితనీరజములీల నెంతనేత్రపర్వమయ్యెను? ఆమాట నిప్పుడు స్మరింపనేల? అదియొక స్వప్నము.

(చంద్రకేతు వచ్చును)

చ॥ కే॥—సోదరా! చాణక్యుని యాజ్ఞానుసారము నేటి రాత్రి భూతపూర్వమహారాజగు నందుని బలియొసంగెదరట.

చ॥ గు॥—ఏమి? నందుని బలియిత్తురా? బ్రాహ్మణుని యాజ్ఞానుసారమా? నేనెవడను? మగధమహారాజను గానా? ఇంతశ్రమ-యింతటి యాయోజనమును-- బ్రాహ్మణప్రభుత్వ హోమాగ్నికి నాజ్యముగా బరిణమింప జేయవలయునా? చంద్రకేతూ! ఇందు శిరఃకర్తన మనవసరము, అట్లు కాగూడదు, నేను క్షమాపత్రమును వ్రాసిపంపెదను. నీవు శీఘ్రమేపోయి "బలియొసంగవలదని మహారాజు చంద్రగుప్తుని యాజ్ఞ" అని చెప్పుము; ప్రార్థనము కాదాజ్ఞయనుము; పొమ్ము. (ఆతడుపోవును)

ఏమి యీ బ్రాహ్మణునిగర్వము! నాకొకింతయేని వర్తమాన మంపక నాయనుమతిగోరక యెట్టి కార్యము దల బెట్టినాడు! ఆశ్చర్య మాశ్చర్యము! నేనీసామ్రాజ్యమునకు సంబంధించినవాడను కాననియు, తనచేతనాడు కీలుబొమ్మనని తలంచెగాబోలు?

(ఛాయ వచ్చును)

ఛాయ—మహారాజా! అపరాధ మొనర్చితిని సైగింపుము; అజ్ఞరాలను.

చ॥ గు॥—ఛాయా! నేనుక్షమించుటకునీవు చేసినతప్పేమి?

ఛాయ—మిమ్ము పరుషవాక్యముల నాడితిని. అప రాధమయ్యె, క్షమింపుడు; లేనిచో ప్రాణదండన మొసంగుడు.

చ॥గు—బాగుబాగు! ఇదేమిఛాయా? నీ వే యపరాధమునం జేయలేదే? నాయెడ నీకు ఘృణ యున్న నట్లు చెప్పుట నేరమగునా?

ఛాయ—మహారాజా! ఘృణయా! జాగ్రదవస్థయందు ధ్యానమునకును, నిద్రావస్థయందు స్వప్నమునకు నేకలక్ష్యమై ఇహమున నాసర్వస్వమును పరమున నాస్వర్గమును నై వర లెడు నీదర్శనము నాకు సర్వతీర్థాభిగమనంబున, దర్శనాభావ మభిశాపరూపమై వర్తిలుచునుండ నిన్నుజూచి యేవగించు దాననా? నే నసత్యమాడితిని. ఒడలెరుంగమిచే నాకు మతి పోయెను. ఈయారాటము తొలంగు టెట్లు? నిన్ను మరచిన బోవును కాబోలు, కాని మరువజాల!

చ॥గు—ఛాయా! నే నేమియొనర్చితిని?

ఛాయా—ఏమియొనర్చితివా? ఏమి యొనర్చలేదని య డుగుము-తినుటకాకలి, పరుండుటకు నిద్ర, సర్వకాలసర్వావస్థల చిత్తశాంతియు లేకుండ జేసితివి. నాదృష్టిపథమున జగమం మంతయు లోపింపజేసితివి- నేను స్వర్గముననుంటినో, నరకమున నుంటినో తెలియజాలను ఇంతజేసియూ నే నేమిచేసితినని యడుగుచుంటివా? నిష్ఠురుడా! నీకు జాలిలేదా! (ఏడ్చును)

చ॥గు—ఛాయా! (చేయిపట్టుకొనును)

ఛాయ—నన్నంటకుము. దూరముగ నుండుము. నీ చేయి సోకినతోడనే నా దేహమున విద్యుత్ప్రవాహమువలె నేద్దియో చరించుచున్నది. మనసు శాంతిస్పైనాడెను కంచు బంతివలె ఖంగుమని మ్రోగుచున్నది. ఈయున్మాదమును సశమనము చేయవలయు-నన్ను విడువుము (పోవును)

చం॥గు—వింతగానున్నది. ఇన్నిరోజులీమెతో మెలగు చుంటినే కాని యీమెయభిప్రాయ మెరుంగలేకపోతిని.

---

ఐదవరంగము

---

(చాణక్యుండు-అంగరక్షకులు-ఎదుటనందుడు ఖైదీగానిలుచును. యూపస్తంభము క్షత్రియునుంచును, కాత్యాయనుడు నిలుచును.)

చాణ—భూతపూర్వమగధమహారాజా! నందా! ఇప్పటికిని బ్రాహ్మణప్రతాపము మొక్కవోలేదనుట నీకనుభవసిద్ధమయ్యెనా? ఈశ్వరుడు మూర్ఖుడు కాడు, కావుననే బ్రాహ్మణునియందు జ్ఞానమునుంచెను. ఆర్యఋషిగణము మూర్ఖులు కారు; కావుననే క్షత్రియునకంటె బ్రాహ్మణు నధికముగ మన్నించిరి. బ్రాహ్మణు నణగద్రొక్కుటకు దగిన సామర్థ్య మెవ్వనికినిలేదు. భారతవర్షమున సనాతనధర్మమున సాగుచుండు నంతకాలము బ్రాహ్మణుడు సంఘశాసనము

సేయకతప్పదు, పిమ్మట నొకసారియే ధర్మమునశించును. అప్పుడు వర్ణభేదముండదు, మతాచారములు మట్టిలో గలియును,

నంద—ఈదంభవాక్యములు వినిపించుటకా నన్నిక్కడకు బిలిపించితివి?

చాణ—కాదు. కాదు. ఇవి దంభవాక్యములు కావు. ఆకత్తిని జూచితివా? ఆయూపకాష్ఠమును గాంచితివా? ఇవి యేల నిట దేబడినవో నీకెరిగింపవలయునా? నే నానాడు చేసిన ప్రతిజ్ఞ నీకు జ్ఞప్తియున్నదా? నీరక్తముచే సిక్తములగు హస్తములతో నాకురుల ముడివేయుదు ననలేదా? చూడు మిదివరకూవాటిని ముడివేయలేదు. నిన్నిక్కడి కేల రప్పించితినో యిప్పుడైన బోధపడినదా?

నంద—నన్ను వధింతువా?

చాణ—అందుకు సందియమా?

నంద—నిరస్త్రబందీకృతుని వధింతువా? హత్య జేయుటయా మీసనాతన ధర్మము?

చాణ—అబ్బో! ఈనాడు క్షత్రియునియొద్ద బ్రాహ్మణుడు సనాతనధర్మము నేర్చుకొనవలసివచ్చెనా? ఆనాడీ ధర్మబుద్ధి యేమయ్యె? నందా! విను. ఇది హత్యకాదు. ఇది నీకు మృత్యుదండనము. దాని విధించువాడను నేను.

నంద—ఏయపరాధమునకు?

చాణ—బ్రాహ్మహత్యాపరాధమునకు, బ్రాహ్మణుని

సంపదను హరించి వానినవమానించిన యపరాధమునకు, దీని నీవుహత్య యనుచుంటివి, ఇందలి న్యాయమును విమ ర్శించి వచింపుచున్నాను. అందుకు నాకధికారము గలదు. నందా! నేను బ్రాహ్మణుడను. సిద్ధముగా నుండుము. భటు లారా! వీని యూపస్తంభమునకు గట్టుడు.

నంద—అయ్యా! నేను కాత్యాయనునియెడ, నీయెడ నపరాధ మొనర్చితిని. మీరు నన్ను క్షమింపుడు. (మ్రొక్కును)

చాణ—చూచితివా? నేనప్పుడు బల్కిన ప్రతియక్ష రమూనిజము. "ఒకనాడీ భిక్షుకునిపాదములపై బడి ప్రాణభిక్ష నీవు యాచింతువు. దాని నేనొసంగన"ని చెప్పలేదా? ఇప్పు డెట్లిత్తును?

నంద—బ్రాహ్మణుడా! నేను నిన్ను ప్రాణభిక్ష పెట్టు మని యడుగుట లేదు. బ్రాహ్మణుని ప్రభుత్వమును మన్నించు వాడను గాను, శూద్రుడన నాకసహ్యము! అందును కులటా సుతుడగు చంద్రగుప్తుడన్న నాకు పరమాసహ్యము మృత్యు భీతి నాకు లేదు. నీరక్తనేత్రముల నక్కర సేయువాడను కాను. నాయెడ నొనర్పబడిన యన్యాయమునకు చింతించుచుంటిని. ప్రజలసంపదల హరించి,నరహత్యల జేయునంతటి పాపినిగాను. సంగదోషము నన్ను పాపిగ నొనర్చెను. క్షమింపుము. కాత్యాయనా!

కాత్యా—మహారాజా! నిన్ను నే క్షమించితిని.

చాణ—కాత్యాయనా! జాగ్రత్త! క్షమయనునది

లేదు. ఈపృథ్విపై నెవరును వేరొకరిని క్షమింపజాలరు. నందా! నాహృదయకుహరమందు ధగధగమండెడు వ్యథ యను నావము నీకంటినుండిజారు నాలుగునీటిబొట్టులచే చల్లా రునని యెంచితివా? ఈకాత్యాయనుని క్షమయూనాలుకచివర నుండునదే కాని నాభినుండి వెడలునది కాదు. కేవల ముఖ వర్తి కాని యుల్లమునంటునదికాదు. మరణశిక్ష ననుభవించు నప్పు డేడువనివా డుండునా? అనుతాప మెవనికుండదు? అట్టి బాష్పబిందువులచే ప్రతిహింసాజ్వాల చల్లారునా? మరియు పిడుగునుబోలినవ్యథచే నూరువ్రక్కలైన మానసము క్షమ యను టంకముచే వెనుకటివలె సంధింపబడుట నేనుచూడ లేదు, వినలేదు. అది యసంభవము. అసంగతము.

కాత్యా—కాని మహాత్మా! పాపము నందుడు బాలుడు.

చాణ—బాలు డగ్నిలో చేయిపెట్టిన నది కాలాదా? అగ్ని తనపని నెరవేర్చుటలో ముందువెనుక లాలోచింపదు. పెద్దచిన్నయను నంతర మూరయదు. నే నట్టివాడను.

కాత్యా—ఐనను-పాణిని...

చాణ—తిరుగ పాణిని యనుచున్నావా? నందునకు దోడు నీకును మృత్యు వాసన్నము కాగలదు. యూపస్తంభ మునకు కట్టుడు.

కాత్యా—నందుడు మీకృపకు పాత్రుడు.

చాణ—నాకెరుక. కాత్యాయనా! కత్తి నెత్తుము. నీవు

నీచేతితో వీనిని చంపవలయును.

కాత్యా—నేనా?

చాణ—నీవే! పుత్రహత్యకు బ్రతీకార మొనర్పుము. నీయేడ్గురుసుతుల శీర్ణపాండురమూర్తుల, నాహారమునకై హీనస్వరముతో వారొనర్చిన హాహాకారము, వారి నిష్ప్రభదృష్టి, నిశ్చల శీతలకఠోరగాత్రములూ, జ్ఞప్తికి దెచ్చుకొనుము. వారి నిష్పందనిర్నిమేష నేత్రములపై, మృత్యుభీకరముద్రను స్మరణకు రప్పింపుము. వారిమృత్యువు నీకన్నులయెదుటనే జరిగెగదా? నీవు వారితండ్రివి. వారుచచ్చునప్పుడు నీతోనేమనిరి? కాత్యాయనా! చేతులార కసిదీర్చుకొనుము- ఆలసింపకుము. భూతపూర్వమహారాజా! నందా! ఇది బ్రాహ్మణునికర్తవ్యము కాదు, కాని విధి తప్పివచ్చునపు డేమిసేయుదుము? ఇప్పటి బ్రాహ్మణులకు పూర్వుల తపోబలములేదు. అదియుండెనా, ద్వితీయ పరశురామునిభాతి భారతవర్షమును నిఃక్షత్రియము జేయవలెననియు, కపిలునిలీల క్రోధదృష్టిచే నందవంశమును నాశనముచేయవలెననియు, నాకున్నది. కలియుగమున నవి కాజాలవు. అందుచే ఖడ్గసాహాయ్యము కావలసివచ్చె. ఎట్టులైన బ్రాహ్మణపరిభావ మొకసారి చూపవలయును. కంటివా దానిని? కాత్యాయనా! కానిమ్ము...నందా! ఇంకొకమాట. నీవంశమున నొకపురుషుడైన మిగులుటలేదు. నీయింట దీపము పెట్టుదిక్కు లేదు, నీవంశము నీతోసరి, కాత్యాయనా! చంపుము.

(చంద్రకేతు వచ్చును.)

చ॥ కే—ఆ బ్రాహ్మణోత్తమా! ఆగు మాగుము, కత్తిని దించుము.

చాణ—చంద్రకేతూ! ఏల?

చ॥ కే—ఇదిగో మహారాజునాజ్ఞ (పత్రముజూపును.)

చాణ—నాకర్థము కాలేదు.

చ॥ కే—ఇదిగో చంద్రగుప్తమహారాజుకు మాపత్రము. వారు నందుని చెర విముక్తుంజేసిరి.

చాణ—చంద్రగుప్తునాజ్ఞయా? తెలిసినది. ఇది నాకు కాదు. కాత్యాయనా! కానిమ్ము.

చ॥ కే॥—గురుదేవా! ఇదిరాజాజ్ఞ.

చాణ—ఇది బ్రాహ్మణునాజ్ఞ, కాత్యాయనా! చంపుము.

చ॥ కే—వలదు. అట్లైన మహారాజుగారుస్వయముగా దయచేయుదురు, తత్పూర్వ మీవధజరుగనీయను. రాజాజ్ఞను పాలింపక తీరదు, భటులారా! ఆయుధములను సిద్ధము సేయుడు. (వారు ముందుకు వత్తురు)

చాణ—అట్లైనట్టికిని జరుగనేరదు. అక్కడనే యుండుడు. (వెన్కకు పోవుదురు)

చ॥ కే॥—వీరబలా? మహారాజును రమ్మనుము. వారు వచ్చువరకు నే నీనందుని రక్షింతును.

చాణ—కాత్యాయనా! చూచుచుండెద వేల? మట్టి బొమ్మవా? ఖడ్గము నిటు దెమ్ము.

చ॥ కే॥—బ్రాహ్మణోత్తములకు సాష్టాంగవందనము లొనర్తును, కాని రాజాజ్ఞ నుల్లంఘింపనీయను.

చాణ—కాత్యాయనా! సంకోచము వలదు. చంద్రకేతూ! నీ రాజభక్తికి సంతసించితిని. చంద్రగుప్తుని మగధ రాజ్యసింహాసనముపై గూర్చుండబెట్టిన నేను వాని నటనుండి తొలగింపగూడ సమర్థుడను సుమా! కాత్యాయనా! చంపుము.

చ॥ కే॥—ఈకార్యనిర్వహణమున బ్రహ్మహత్య రానున్ననూ నేను జంకువాడ గాను.

(మురప్రవేశించి)

ముర—స్త్రీహత్య రానున్నదో?

చ॥ కే॥—అమ్మా! మీరా? వందనములు.

ముర—ఆహా! నేనే- నాయాజ్ఞ యిది. చంపుము కాత్యాయనా!

చ॥ కే॥—అమ్మా నందుని క్షమింపుడు.

ముర—(నవ్వి)క్షమయా! క్షమలేదు- నేను క్షమింపజాలను, క్షమించుట నెరుగను. ఏలయన నే శూద్రురాలను. క్షమించుట బ్రాహ్మణధర్మము కాని శూద్రధర్మము కాదు.

చ॥ కే॥—అట్లనకుడు! దేవీ! క్షమ మానవులకెల్లరకును సామాన్యధర్మము, బ్రాహ్మణులకే కాదు. క్షమవలనగలుగు నపారసుఖము ననుభవించుటయందు కేవలము బ్రాహ్మణులకే

యధికారము గలదా? క్షమ పవిత్రభాగీరథీజలధారభాతి స్వర్గమునుండి పృథ్వికి నవతరింపలేదా? ఈక్షమయే రోగులయెడ స్వాస్థ్యరూపమున వెలుగుచు మనల రక్షించుచుండును. ఈక్షమయే శోకమున విస్మరణరూపమున వర్తించుచుండును. ఈక్షమయే దారిద్ర్యమున సహిష్ణుతారూపమున నావరించి యుండును. తనయులతప్పులు తల్లిమన్నింపకున్న దరిదాపు లున్నవా? ఇక వారికెవరు దిక్కు? అమ్మా! నందుని క్షమింపుము. నేనతినమ్రుడనై వేడుచున్నాను.

ముర—చంద్రకేతూ! క్షమ యాచించుటకు సివాకడ వేకాదు. నాపంచప్రాణములూ హృదయపంజరద్వారముల భేదించి బైటపడి పాదములుపట్టి క్షమాభిక్ష నడుగుచుండుట లేదా? నందుడు కారాగారమున నుండుట నేనెరుగనా? వాడి వస్త్రమైయున్న వాని ముఖసరోజము నే గాంచుటలేదా? అశ్రుప్రవాహము నాదృష్టిపథము నరికట్టలేదా? నందా? క్షత్రియస్త్రీపాలకంటె శూద్రస్త్రీపాలయందు తీపి తక్కువా? క్షత్రియస్త్రీప్రేమకన్న శూద్రస్త్రీప్రేమకు తెలుపు తక్కువా? మూఢుడా! నిన్ను నేను క్షమింపను. నేను శూద్రస్త్రీని, వేశ్యనుకానా? కాత్యాయనా! చంపుము.

చ॥ కే—అమ్మా! వలదని రాజాజ్ఞ.

ముర—చంపుమని రాజమాతయాజ్ఞ! నేను దాసినైననూ, వేశ్యనైననూ, చంద్రగుప్త మహారాజునకు తల్లిని. నాయాజ్ఞకు దిరుగులేదు. కాత్యాయనా చంపుము.

చ॥ కే—సరే- నేను పరాజితుడనైతిని. సర్వదేశకాలావస్థలయందును మాతృదేవతచే నందరూ పరాజితులే! "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ." స్త్రీల కన్నెత్తిచూచుటకు నాకు ధైర్యము చాలదు. అమ్మా! మీ చిత్తము.

చాణ—కాత్యాయనా! ఇక వధింపుము (వధించును) అహ్హాహ్హా! ప్రతిహింసాపూర్తియైనది. నాప్రతిజ్ఞ సార్థకమైనది. ఇక నీకురుల ముడివేసెదను.

కాత్యా—నాయెద్దురు కుమారుల చావునకుతగినప్రతీకారమైనది, ధన్యుడను.

ముర—అబ్బా! అబ్బా! అయ్యో! కాత్యాయనా! చంపితివా? నేడెట్టి ఘోరమొనర్చితిని! నందుని రక్షింపవచ్చి భక్షించితిని. నందా! నీతలవ్రాత కేవ రేమి సేయుదురు?

(చంద్రగుప్తుడు వచ్చును)

చ॥గు—ఇదియేమి?

ముర—కాత్యాయనుడు నందుని జంపెను. ఆనోటనే వాడు నాపాలు ద్రావెను. ఆదేహమునే నావక్షమందుంచి వాని జోగొట్టి నిద్రబుచ్చితిని. ఆహా! నేడెంత ఘోరమాయె!

చ॥గు—వధించిన దెవరు?

కాత్యా—నేను.

చ॥గు—ఎవరి యాజ్ఞచే?

ముర—నాయాజ్ఞచే. కాని కాత్యాయనా! ఎంతపని జేసితివి? నేను స్త్రీనికదా! మూఢురాలను, అబలను, అజ్ఞ

రాలను. అయ్యో! ఈముఖమును నీవెన్నిసారులు ముద్దు గొనలేదు! ఎంత పైశాచికోల్లాసమున నీకృత్య మొనర్చితివి.

చ॥గు—కాత్యాయనా! రాజాజ్ఞ నల్లంఘించితివా?

కాత్యా—అహో! ఉల్లంఘించితిని!

చ॥గు—సరే! నీవవధ్యుడవు కాన నారాజ్యమునుండి నిర్వాసితుని జేసితిని. పొమ్ము.

కాత్యా—మహారాజా!

చ॥గు—మారుమాటాడకు. నాయాజ్ఞ యాచకుని మొర యనుకొంటివా? పొమ్ము. ఇదియే నీకు శిక్ష— చంద్రకేతూ!

చ॥కే—సోదరా! నిశాతఖడ్గపాణులై వీరు లెందరు విపక్షులై నిల్చినను ప్రాణములపై నాసవీడి, చంద్రకేతు రాజాజ్ఞాపాలనమునకు యుద్ధసన్నద్ధుడై వెనుకంజ వేట్టడు కాని, నారులయెడ శిశువునకంటె బలహీనుడు.

చ॥గు—సరే, తల్లీ!

ముర—నాయనా! నా యపరాధమునకు నన్ను శిక్షింపుము.

చ॥గు—(చేతులు మోడ్చి) నీ యపరాధమా? అమ్మా పిల్లలయెడ తల్లి యపరాధమా? నీయిష్టమెట్లో అట్లే జరుగ నిమ్ము. నీవు నాకు తల్లివి—నందా! నీమూర్ఖతయే నీమృత్యువునకు హేతువయ్యె...(పోవును.)

—————




## నాల్గవ అంకము.

---

### మొదటి రంగము

(చాణక్యుని కుటీరము.)

చాణ—ప్రతిహింసాపూర్తియైనది, కాని యది క్షణికోన్మాదము. అప్పుడే నశించినది. తిరుగ ప్రళయమాసన్నము కానున్నది. పైధ్వనులన్నియు విరమించెను, హృదయమందలి హాహాకారము మాత్రము వినబడుచునే యున్నది. హృదయకంపితాగ్రహమున నెవ్వరినైన గాగిలింపవలెననియున్నది, కాని నాయగాధస్నేహరాశి నుంపదగిన యోగ్యవ్యక్తి గానరాదు. పరాకాష్ట మానదాయె, పట్టుదల సడలదాయె; వేడినిట్టూర్పులు పుచ్చుచు నిట్లుండవలయునా? ఏమి గతి?... ఓసి రాక్షసీ! ఎంత జేసితివే?...ఇది కేవల మరణ్యారోదనము, కంకాళముపై కరాఘాతము. (చారుడు వచ్చును)

ఏమివార్తలు?

చారు—కాత్యాయనుడు సెల్యూకసు శిబిరమును జేరినాడనుట నిక్కము.

చాణ—సరే! తరువాత?

చారు—యవనులు సింధునదిని దాటిరి.

చాణ—హారిసేన యెంత?

చారు—నాల్గులక్షలు.

చాణ—కాత్యాయనా! నీజన్మమంతయు నొకతీరు ననే వెల్లినది. నీవీరాజ్యమునుండి నిర్వాసితుడవైననాడే నీకం తయు బోధింపవలయునని యెంచితిని, కాని సెల్యూకసుపక్ష మున జేరి యాతని డెట్లాడించిన నట్లాడుచున్నావు. నామంత్రి త్వమున కీర్ష్యవహించితివో మూర్ఖుడవు! ఊరిలోని సమాచారములేమి?

చారు—రాజద్రోహులు దళబద్ధులైరి. ముమ్మారు కార్యముల ప్రయోగించుట వారిసంకేతము.

చాణ—నగరులోని విశేషములు?

చారు—మహారాజుగారి శయనాగారమునకు సొరంగ మొకటి త్రవ్వియిరువదియైదుగురు ఘాతకులు వారి యాగమ మునకై వేచియున్నారు.

చాణ—ఇదివరకే వింటిని. వారి నాయకుడెవరు?

చారు—వాచాలుడు.

చాణ—మూర్ఖా! వాచాలా! ఇంతవాడవా? వీరబలా! నీవుపోయి వారినిజంపి రమ్ము. వహ్వా! చారులచే వార్తలురప్పించుట యత్యద్భుత వ్యవసాయము. ఇది కేవల చాణక్యసృష్టి. శ్రీరామచంద్రుడున్నూ చారుల నియమించు

చుండెను. కాని వారిమూలమున రాజుపై యపవార్తలమాత్రము గ్రహించుచుండెను. నేనో, అట్టియపవాదముల నుట్టిలోబెట్టుచున్నాను.

(చంద్రకేతు వచ్చును)

చ॥ కే॥—గురుదేవా! నమస్కారము. ఏమి యాజ్ఞ?

చాణ—చంద్రగుప్తుడు దక్షిణదిగ్విజయ మొనర్చి నేటి రాత్రి పురమును బ్రవేశింప నున్నాడని నీవెరుగుదువా?

చ॥ కే॥—ఎరుగుదును. నగరమున నుత్సవముల సిద్ధము చేయుమని యాజ్ఞనంపిరి.

చాణ—నీ వేమియేర్పాటుల జేసితివి?

చ॥ కే॥—నగరమంతటను దీపావళినుంతురు. వీథుల యందు బాజాలు శంఖ, భేరీ, కాహళధ్వనులూ మ్రోగుచుండును.

చాణ—ఏదియు వలదు. వీనివలన బ్రయోజనము లేదు. నావైపేల నిర్వేరపడి చూచెదవు? ఉత్సవముల నాపుము, పొమ్ము.

చ॥ కే॥—ఇదేమి? మహాత్మా!

చాణ—మారుమాటాడక పొమ్ము...(అతడుపోవును)

మహాపవిత్రమగు నీయుజ్జ్వల రాజ్యమునువీడి యెట బోవుదును? ఆలోకమండితశిఖర మప్పుడే కనబడుచున్నది. సర్వము నంధకారమున లుప్తము కాకపూర్వము పోవుదునా? ఓసీ! పిచ్చాచీ! నన్నువీడుము. నేబోయెదను...కాదు కాదు.

ఎందు బోవుదును ? నన్ను చేయిపట్టి తీసుకొనిపోవు వారెవ్వ రు? అసత్యము, ప్రవంచన, చౌర్యము, హత్య...వీటికన్నిటికి రాజ్యమొకటియే- ఇందు దోసగేమి?...బలే...బాగున్నది.. ఎంత రాత్రియైనది...ఏమిదీ? ఇంతవరకెక్కడనున్న దీవెల్గు? పైన, క్రింద, దగ్గఱ, దూరమున-దిగంతములుదాక కుప్పతెప్ప లుగా నున్నదే. ఏమికమనీయచంద్రిక! చాలాదినములనుండియు జూడలేదు...ఆకాశమున చిన్నచిన్న తెల్లసి మేఘశకలములు పారాడుచున్నవి. జ్యోత్స్నాస్నాతయగు భాగీరథి కాతరస్వర ముచే మృదుమధురగానము సల్పుచున్నది. పతితపావనీ! తల్లీ, సురధునీ! భగీరథు డెట్టిపుణ్యబలముచే నిన్ను—స్వర్గమందలి మందాకినిని--మర్త్యలోకమునకు గొనివచ్చెనో! మరుకల్ప మున నాహృదయమున నట్టిభక్త్యుచ్ఛ్వాసమునొక్కసారి జనిం పరాదా? నేనొకసారి "అమ్మా!" అనినీతరంగములపై తాళము వేయుచు నాడనా?... ఏమిది? చాణక్యా! నీ వధీరుడ వగుచుంటివి? లేదు. లేదు. ఇక చూడను.

(లోపల "తండ్రీ! బిచ్చము!" అని యరచుచు భిక్షుకుడు బాలికయును వత్తురు)

చాణ—ఎవరది? లోనికి రండు.

భిక్షు—బాబూ! బిచ్చము.

చాణ—ఇంత రాత్రివేళ బిచ్చమెత్తుచుంటి రేమి?

భిక్షు—ఇప్పటి కీయూరు చేరితిమి- ప్రొద్దుటినుండియు నూతిండిలేదు బాబూ!

చాణ—ఏమిది? ఈబాలికను చూచి నప్పటినుండియు నా కేడ్పువచ్చుచున్న ట్లున్నది బాలికా!...ఏమి నాకీగార్బల్యము? అమ్మా దగ్గరరమ్ము. ఓరీబిచ్చగాడా, ఈబాలిక నీ కూతురా?

బిచ్చ—ఔను, నాయనా?

చాణ—అమ్మాయీ! నీపే రేమి?

బాలి—నాపేరు మాధూ.

చాణ—మీా యూరేది?

బాలి—చాలదూరము.

బిచ్చ—మాకూరూపేరూ నుండునా? ఇల్లులేదువాకిలీ లేదు; ఏసత్రముననో లేక యేచెట్టుక్రిందనో వసింతుము.

చాణ—బాలా! నీవు పాడగలవా?

బిచ్చ—ఏది మాధూ! పాడుము.

చాణ—వద్దువద్దు-ఇంచుక నేదదీర్చుకొనుము.

బిచ్చ—అక్కరలేదు, బాబూ? మా కదేవృత్తి.

(పాటపాడును.)

పాట.

మన్నుమిన్నును ఏక-మౌనట్లు చీకట్లు
బ్రహ్మండభాండమున-గ్రమ్మికొని యుండె॥మ॥
జలరాశిగర్జించె-బడబానలము నించె
పెనుగాలి చెలరేగి-బీభత్సమయ్యె॥మ॥

చాణ—ఆరాత్రియు నిట్లేయుండెను. చంద్రుడు

హఠాత్తుగా మేఘములచే కప్పబడెను, ఓరుగాలిచే దీపమారి పోయె-ఆహా!-కుమారీ! అదియంతయు నాకస్వర్గము- స్వప్నము...ఏమిది? చాణక్యునికన్నులు నీరునించుచున్నవి?- ఓరీ బిచ్చగాడా! ఈసామ్మ్ము గొనుము- బాలికా! ఇటురమ్ము (ముద్దిడి) పొమ్ము-త్వరలోరమ్ము.

---

రెండవరంగము

(చంద్రగుప్తుని మందిరము.)

ముర—చంద్రకేతూ! దక్షిణాపథమును జయించి చంద్రగుప్తుడు వచ్చుచున్నాడు. నగరమున నుత్సవ మేల చేయించలేదు?

చ॥ కే—అమ్మా! చాణక్యపండితు లాపి వేయుమని యాజ్ఞాపించెను.

ముర—ఎట్లు? గురువుగారు తనశిష్యుని విజయోత్సవ మాపుమనినారా! ఇదివారికెట్లువిచారహేతువు?

చ॥ కే—అమ్మా! మంత్రిగారు నిషేధించిరి కాన దాని కేద్దియో కారణముండియుండును.

ముర—ఆ! కారణమున కేమిలే! నా కుమారుని విజయగౌరవమందు బ్రాహ్మణున కీర్ష్యజనించెను.

చ॥ కే—విజయగౌరవ సూచకమే లేనిదే? వారిపై నిట్లు నిందమోపుట భావ్యముకాదు,

ముర—వినుము. బాజాలచప్పుడు వినబడునట్లున్నది. నాకూన తిరిగి వచ్చుచున్నాడు, కావున నేబోయి మేడనెక్కి తత్ప్రవేశ సమారోహము గనులార చూచెద. (పోవును.)

చ॥ కే—చాలాదినములకు నేడు నాసోదరుని విజయ దీపితమగు ముఖమును జూచుభాగ్యము లభించినది. ఎంత సుదినము! ఏమి సంతసము! చంద్రగుప్తా! పూర్వజన్మమున మనము సోదరులము కాబోలు?

(తెరలో కోలాహలము. విజయపతాకధారులగు సైనికులు ముందువడువ చంద్రగుప్తమహారాజు ప్రవేశించును.)

సోదరా! ఇటురమ్ము (చేతులు చాచును).

చ॥గు—నాయాజ్ఞ నీకు జేరలేదా?

చ॥ కే—సోదరా! ఏయాజ్ఞ?

చ॥గు—నాపూరాగమనమెరిగి పట్టణమున నుత్సవము జేయ జాటింపుమని కబురంపితిని. అది నీకు జేరలేదా?

చ॥ కే—చేరినది.

చ॥గు—దానినేల మన్నింపలేదు?

చ॥ కే—మంత్రిగారు నిషేధించిరి.

చ॥గు—అట్లగునని నేను గ్రహించితిని. చంద్రకేతూ! మగధరాజను నేనా, లేక చాణక్యుడా?

చ॥ కే—సోదరా! నామాటవినుము.

చ॥గు—ముందు నాప్రశ్నకుత్తరమిమ్ము. మగధకు ప్రభువెవరు?

చ॥ కే.—మగధకు రాజవు నీవే!

చ॥గు—మరి?

చ॥ కే.—ప్రియవరా! వినుము.

చ॥గు—నేను వినను. మంత్రిని బిలువుము.

చ॥ కే—సోదరా! నామాట నాలింపుము. ఏదియో హేతువు—

చ॥గు—వినను. ఆతనిసమాధానము విననలయును.

చ॥ కే—ఆతడు చెప్పినది......

చ॥గు—చాల్చాలు! వా రేమందురో స్వయముగా వచ్చి చెప్పుకొననిమ్ము. మగధకు రాజాతడా నేనో యిప్పుడే తేలవలయును. ఏమి యుద్ధత!

చ॥ కే—మిత్రమా! తొందరపడకుము, నామాట వినుము.

చ॥గు—చంద్రకేతూ! నీవుకూడా నామాట నిరాకరింతువా? పొమ్ము. (అతడు పోవును.) ఈబ్రాహ్మణునిదంభము జూడ నాయొడలు మండుచున్నది. ఇది రెండవసారి. ఎంతని యోర్చియుందును...ఏమి యసూయ! ఆశ్చర్యము! ఇప్పుడే వలదు...మొదట సమాధాన మడిగెదను.

(చాణక్య చంద్రకేతులు వత్తురు.)

చాణ—జయము! జయము! మహారాజుగారికి!

చ॥గు—మంత్రిసత్తమా! నేను నేనువచ్చుసరికి పట్టణమంతయు నలంకరింపుడని యాజ్ఞాపించితిని కదా! అట్లేల

చేయలేదు ?

చాణ—నేను నిషేధించితిని.

చ॥గు—కారణ మడుగవచ్చునా ?

చాణ—ఇప్పుడు ప్రయోజనము లేదు.

చ॥గు—లేకేమి ?

చాణ—నేను బాగుగ నాలోచించి చేసినదే !

చ॥గు—ఐనను కారణము వినవలెనని యున్నది.

చాణ—దానికి తగినయదను రాలేదు. అవసరమగు నప్పుడు చెప్పెదను.

చ॥గు—మంత్రివరా ! మగధకు రాజును నేనేనా ?

చాణ—(నవ్వును)

చ॥గు—ఈయుద్ధతి నేను సహింపజాలను. ఇందలి న్యాయమును పరిశీలింపవలయు.

చాణ—చంద్రగుప్తా ! నీకు కోపము వచ్చినట్లున్నది. ఇంచుక శాంతించిన వెనుక ప్రసంగించుట యుక్తము. (వెళ్ళ బోవును.)

చ॥గు—మంత్రీ !

చాణ—వత్సా !

చ॥గు—ఈరాజ్యమునకు ప్రభువును నేనో లేక నా మంత్రియో వినవలతును.

చాణ—మహారాజు చంద్రగుప్తుడే. అందుకు సందియ మేల ?

చ॥గు—నాకట్లగపడ లేదు. నాసామ్రాజ్యమును నేను

బందీకృతుడ నైనట్లు కనబడుచున్నది. నాయింట నేను దాసు డనైనట్లున్నది. మంత్రియగు చాణక్యుడు పాటలీపుత్రమున హాయిగా కూరుచుండి రాజభోగము లనుభవించుచుండ రాజు దేశాంతరముల కేగి వాటినిజయించిరావలయునా? చాణక్యుని గుణగణము ప్రజలెల్లెడ గొనియాడ జంద్రగుప్తు డాగీతము లకు దగిన సాధనసామగ్రి సేకరింపవలయును కాబోలు? మహా రాజగు చంద్రగుప్తుడు మంత్రియగు చాణక్యుని యాజ్ఞలను శిరసావహించి పాలించుచుండ, చాణక్యుడు మహారాజునాజ్ఞ లను పాదములక్రింద నణగద్రొక్కుచుండునా? మనకిద్దరకు సంబంధ మీాగతినుండ నెంతశీఘ్రముగా అది విచ్ఛిన్న మైన నంత శ్రేయమని తోచుచున్నది.

చాణ—మహారాజా! మీాయభిరుచి యెట్లున్న నట్లు జరుపవచ్చును, నే నీమంత్రిత్వమును కోరిపుచ్చుకొనలేదు; ఇప్పుడే యాపదవిని వీడుచున్నాడను.

చ॥గు—భాగ్యము. తత్పూర్వము తగిన సమాధాన మీాయవలయును.

చాణ—దాని నేనిచ్చువాడను గాను.

చ॥గు—ఇంత సాహసమా? సైనికులారా! ఈతని బందీకృతుని చేయుడు. ఊరకుంటిరేమి? (కత్తి దూయును)

చాణ—శూద్రున కింతశక్తి నుద్ధతయు నిదివర కుద్భవింపలేదు. మహారాజా! ఇదే మంత్రిత్వమును త్యజించు చున్నాను. చాణక్యుడు నిశ్చింతుడై రాజధానియం దాట

లాడుటలేదు. చతుస్సముద్రవ్యాప్తమగు నీసామ్రాజ్యమును జాగరూకుడై పాలించుచుండెడు చాణక్యునకు రాజభోగమా? ఆతడు తినునది రెండుపిడికెళ్ళ నివ్వరికూడు, శయనించునది కృష్ణాజినముపై, రాత్రిమూడుజాములును కుటీరాంగణమందు మస్తిష్కముకాగున ట్లాలోచించుచుండును. దానికేమి? నేబోయెదను. రాజ్యముమీది, మీరే దానిని పాలించు కొనుడు. నేబోవుటకు పూర్వము కొన్నిమాటలు చెప్పవలసి యున్నది. భూతపూర్వమహారాజునందునిమంత్రి విద్రోహ మంత్రణమును జరిపించుచు గొప్పకుట్రను పన్నినాడు, నేటి రాత్రి యుత్సవసమయమున వారిసేన పట్టణముపైబడనున్నది. నీపడకగదిలోనికి సొరంగమొకటిత్రవ్వి నిన్నుచంపుట కందు కొందరు వేచియున్నారు, వారినిజంపుటకు నేను భటుల బంపి తిని. (పోయి తిరుగవచ్చి) ఇంకొక మాట. జయశీలుడగు సెల్యూకసు నాల్గులక్షలసేనతో సింధునదిని దాటి మనపై బడనెంచి కొందరు చారులనిట బంపియున్నాడు. వారి నేసమ యింపజేసితిని. ఈవిధమున నెందరో శత్రువులు నలువైపుల శస్త్రపాణులై తగిన సమయమును నిరీక్షించి యున్నారు; కావున నిది యుత్సవ సమయముకాదు. ఏమి కీడు మూడునో అని విపులాభ్యర్చన మాన్పించితిని. అంతియేకాని యోర్వ లేమి తనముచే గాదు.

చ॥ కే —(చాణక్యునికి మ్రొక్కి) గురుదేవా? క్షమింపు డు, అజ్ఞానులము.

చాణ—సమాధాన మిచ్చినపిమ్మట సచివత్వగ్రహణము చేయును. (పోవును)

చ॥ కే—బంధువరా! మంత్రిమహాశయు ననునయించి రప్పింపుము.

చ॥ గు॥—ఏల? చాణక్యుడు లేకున్న రాచకార్యములు నడువవా? ఇంత యహంకారమా? నావలన నేరమేమి? ఏమి చెడిపోయినది? నిశ్చయముగా నేనిప్పుడు బంధవిముక్తుడనై నిజమైన మహారాజునైతిని.

చ॥ కే॥—సోదరా! నామాట విని అతని రమ్మని వేడుకొనుము.

చ॥గు—చంద్రకేతూ! నీ యుపదేశ మికజాలు, నీయవరోధముననే లోగడ నితని క్షమించితిని. అదియే పొరపాటు. ఈబ్రాహ్మణుని యుద్వృత్తి గాంచుము. నేను మహారాజనైనను నాకధికారము లేదు. సోదరుని క్షమించుటకైనా నేశక్తుడగానా? రాజ్యమున ననామకుడనా? మహారాజవేషము బూనితినా? ఇట్టి వేషధారణము, సగౌరవభాజనమగు సఖినయముకంటె పరమనీచమగు సేవావృత్తియే శ్రేయమనిపించుచున్నది.

చ॥ కే—గురువుగా రొనరించినది నీమేలునకేగదా?

చ॥గు—అటులనా? నా మేలుకొఱకే కాబోలు నా బ్రాహ్మణుడు నాసోదరుని చంపించెను? అతడును కాత్యాయనుడును నా మేలుకొఱకే నాసోదరుని జంపి పైశాచికోల్లా

సమున మృతశరీరముపై దాంపనమాడిరా? నేను చూడలే దనుకొంటివా?

చ॥ కే—ఈ సింహాసనము నీకాత డిప్పించలేదా? ఆ ఋణమేని తీర్చితివా?

చ॥ గు—ఋణమా! చాల్చాలు! నీ వప్రియవాక్య ముల నాడుటయం దతిచతురుడ వగుచున్నావే!

చ॥ కే—అప్రియమైనను సత్యముజెప్పు నధికారము బంధువునకూ మిత్రునకూ లేదా?

చ॥ గు॥—ఉభయులూ సమానులైనచో నీ వన్నది చెల్లును.

చ॥ కే॥—మహారాజా! నాయహామిక మన్నింపుము. .........ఇకముందు మీతో బంధుత్వమాపాదింప సాహ సింపను. ప్రకృతమున నాకనుజ్ఞనిండు. ఒకవాట-సంపత్కా లమున నాబంధుత్వమునం దుపేక్షాభావము మహారాజుగారు వహింపుచున్ననూ ఆపత్కాలమున నట్లుసేయకుందురుగాక. నాసాహాయ్య మావంతయేని ప్రయోజనకారి యైనచో నేటివృత్తాంతమును జ్ఞప్తియందుంచి నన్ను బిలువ వెరుదీయ కుడు. అట్టిసంకోచము వలదు. నేను మీకుపచరింతునేనిప్రా ణముల నైన ధారవోయుటకు సంసిద్ధుడను. పోయివచ్చెదను. సెలవిండు. (పోవును)

———

మూడవరంగము

—:0:—

(యవనశిబిరము- సెల్యూకసు కాత్యాయనులు)

సెల్యూ—వారి సైన్య మారులక్షలున్నదే!

కాత్యా—చాణక్యుడు మంత్రిత్వ పరిత్యాగముచేయుటచే ఆ సేనయంతయు విశృంఖలమైనది. ఈవృత్తాంతమును రహస్యముగా నేనెరిగితిని; మీరు నన్ను నమ్ముడు. అనుమానము వలదు. మగధసామ్రాజ్యమును కలగుండు పెట్టుటకిదే యదను.

సెల్యూ—మనసేన చాలదేమో?

కాత్యా—మీకాశంక వలదు. నందమహారాజుపక్షమున పలువురు సైనాధ్యక్షులును తదితరులును కలరు. వారు తమతమసైన్యములతో మనల జేరుదురు.

సెల్యూ—దాని నిశ్చయించుటెట్లు?

కాత్యా—నిశ్చయముని నేనెరుగుదును. చంద్రకేతుని భిల్లసేన వారిదేశమునకు బోయెగదా. అతడు చంద్రగుప్తునిచే నవమానింపబడియె గావున ప్రాయశః మనపక్షము నవలంబించును. ఇదివరకే చేరవలసినది, ఏలరాలేదో యూహింపజాలకున్నాను.

(హెలెన్ వచ్చును)

హెలె—ఓయీ! బ్రాహ్మణోత్తమా! అందరూ నీవలె విశ్వాసఘాతకులని యెంచితివా!

సెల్యూ—అమ్మాయీ! నీ విప్పుడిట కేలవచ్చితివి?

హెలె—ఈప్రక్కగదిలో చదువుకొనుచుండ నీతని మాటలు పలుమారు నాచెవినిబడుటచే కౌతూహలమున వింటిని. పిమ్మట లోపలనుండ లేక యిటువచ్చితిని... ఓయీ! బ్రాహ్మణుడా! నీవు విశ్వాసఘాతకుడవు.

కాత్యా—నేనా?

హెలె—ఆమాట యొకసారికాదు, నూరుసార్లను చున్నాను, అది సత్యము. రాజునకు విరుద్ధముగా కుట్రలు పన్ని యొకదేశమును చెరచుటకుగాని, యొకజాతిని నిర్మూలించుటకుగాని సమకట్టి, అజస్రప్రవృద్ధమగు రాజభక్తిని దిగనాడి, యాతతాయిసంఘముతోడ సంధియొనర్చువాడును, ప్రశాంతక్షేత్రములయందు రక్తవాహినుల బ్రవహింపజేయువాడును తనజాతికేకాక సమస్తమానవజాతికిని శత్రువు, సర్వనియమములకూ సర్వవ్యవస్థాధర్మములకును శత్రువు. ధర్మమునకు సత్యమునకును శత్రువు... ఓయీ! బ్రాహ్మణాధమా! నాతండ్రిగారి మనమున నారిపోయిన రాజ్యలాలసాగ్నికి కపటవాక్యములను నింధనములజేర్చి, రాజనీతియను వీవనచే వీచి దానిబ్రజ్వరిల్ల జేయుచున్నావా? రెండునాగరజాతుల నడుమ దుస్తరమగు పరిఖను త్రవ్వుచున్నావా? నీకు నరకమున గూడ చోటుండునటుల దోపదు.

కాత్యా—కాని పాణిని—

హెలె—పాణిని వ్రాసినది వ్యాకరణము.

కాత్యా—అందు వేదాంతసార మున్నది.

హెలె—చాల్చాలు నూరకుండుము (అతడు పోవును)

సెల్యూ—అమ్మాయీ! నీతల్లి యవనస్త్రీయా? లేక నిజాతీయురాలా!

హెలె—ఆమె సాక్షా ద్దేవ్యవతారము!

సెల్యూ—ఆమెకూతురగు నీవు యవనగౌరవమును మాప బుట్టితివా?

హెలె—ప్రపంచమున విశృంఖలతయు నత్యాచారచారమును వ్యాపింపజేయుటయేనా యవనులకు గౌరవహేతువగునా? అట్లిన్నటికిని కాదు. యవనగౌరవస్థాపకులు, తత్త్వజ్ఞులు, వైద్యులు, చరిత్రకారులు, కవులు, దేశాభిమానులూ మొదలగువారు. అసభ్యమగు నైరోపాఖండము నాక్రమించియున్న అజ్ఞానధ్వాంతమును రూపుమాప, ప్రబోధసూర్యోదయమును ప్రసాదించుటచే యవనదేశమున కెట్టియశము సంప్రాప్తమాయెనో, ఆశియాఖండమున నార్యావర్త మట్టిగౌరవమునకు భాజనమై విలసిల్లుచున్నది. రెండుసంధ్యలవలె సూర్యాచంద్రమసులవలె పూర్వపశ్చిమఖండములను యవనభారతవర్షములు విభజించుచున్నవి. ఆరెండుదేశముల సంఘట్టనము జగత్ప్రళయహేతువవ జెల్లును. యుద్ధమన హత్యచేయు వ్యవసాయమే.

సెల్యూ—అట్లైన మనపూర్వులు యుద్ధముల కేల గడంగిరి? వారికి నీపాటి వివేకము లేకపోయెనా?

హెలె—వారెట్టిసందర్భముల యుద్ధముల చేయ

బూనిరోయించుక యోచింపుము. క్రూరాత్ములచే నాక్రాంత ములగు దేశములను రక్షించుటకును, దేశమందలి మహోపాత కులను- అగ్నిదాహకులను, మారకులను, దోపిడికాండ్రను- నిర్మూలించుటకు, శాంతిశుభ్రధ్వజమును రక్షణ సేయుటకును, వారు యుద్ధములొనర్చిరి కాని సర్వమును కబళించుటకుగాదు.

సెల్యూ—నే నామాట నమ్మను.

హెలె—తండ్రీ! ఆత్మరక్షణమున కాహవ మనివార్య మైనచో నట్లు కావింపవచ్చును. వేరుపాయము లేనితరి అది వెరవ గును. శాంతిరక్షణమునకు ఘోరుసల్ప వలయుగాని శాంతిభంగ మున కట్లు సేయ జనదు. భారతీయు లిపుడు శాంతి సుఖము ననుభవించుచున్నారు, ఆసుఖనిద్రను నీవు భంగము సేయ నెంచుచుంటివి. నిశ్చింతులగు వారిమనముల నాతంకమును పుట్టింప నెంచుచున్నావు. ఉచ్చదశయందున్న నాగరికతగొంతు నొక్కిచంప నెంచుచుంటివి. తండ్రీ! ఇది యుచితకర్మమా?

సెల్యూ—పిన్నదానవగు నీవాగ్ధోరణి కడ్డులేక యు న్నది. యౌవనమున నీతల్లి యిట్లే నన్ను వేధించుచుండెడిది. ఏరిస్టోటలు చెప్పినట్లు—

హెలె—అబ్బబ్బా! ఒకదెస నేరిస్టోట లెక్కడను జెప్పియుండని మాటలు! ఇంకొకదెస పాణినిసూత్రముల కధ్యాత్మవ్యాఖ్యానము! నాకు మరణబాధగా నున్నది. అప్పు డప్పు డాత్మహత్య చేసికొనవలయు ననిపించుచున్నది.

సెల్యూ—ఏలమ్మా! అట్లనుచుంటివి?

హేలె—ఈమహావిశ్వపరివారమును విద్వేషాహంకార ములు వేరుసేయునట్లు పర్వతములు, నదులు, సముద్రము లునూ వేరుసేయనేరవు. ఇకజాలును తండ్రీ! నీవుపోయి శయ నింపుము (ఆతడు పోవును) హింసాపన్నగము సహస్రఫణముల విప్పి బుసగొట్టుచు వచ్చుచుండ నీప్రపంచము ముగ్ధాంగన వలె దానివైపు నిశ్శబ్దముగా జూచుచున్నది. ఉపాయ మెద్ది యు దోచదు.

నాల్గవరంగము.

---

(సముద్రతీరము—ఏంటిగోనసు వచ్చును.)

ఏంటి—సైనికులెల్ల స్వాతంత్ర్యబంధువుల జేరబోయిరి చాలకాలమునకు వీరికి సమావేశము సమకూడెను. ఎంత సం తసింతురో! సంతోషింపకేమి? నన్నుజూచి యానందించు వారు లేరు. తల్లి జీవించియున్నదో, లేదో? నాబాల్యమున నన్ను లాలనపాలనముల నేమియొనర్చెనో కాని,తదనంతరము పశువుభాతి నడివీథిలోనికి నడిపినది. నేను ప్రేమింపదగిన వారు నిక్కడ నెవ్వరును లేరు. స్వదేశమును జేరితిని, కాని 'నా'యనువారు లేరు కావున నేమి లాభము? ప్రాణసంచున నంగారకణమువోలె, నన్ని దేశమున కెగురజిమ్మినది యొక వ్యాధి. నాజన్మము నాయధీనము గాకున్నను దానికి నేను త్తర వాదిని కావలసివచ్చెను. నన్నుజూచి జాలిగొనువారెవరు? నేనెట్టులైన బ్రపంచమున కేమిలోటు?...లోక మేమియుప

రాధ మొనర్చె? స్వయంభువగునీశ్వరునకుగూడ నీచెట్టలేదా? ఆతనితండ్రి యెవరు? తండ్రి నెరుగకుండుట తప్పా?... అట్లని లోకమర్యాద గణింపకుండుట గూడునా? జనకుల పాపముల యందును, దీనతయందును, వ్యాధియందును సంతానము పాలివారలగుటలేదా? అజ్ఞాతజన్ము నాదరింతురా?... ఇప్పు డామాటయేల? చింతకక్కయుండుటయే శ్రేయము. తలచు కొలదికొలది కడుపు కరిగిపోవుచున్నది... అదిగో! ఆకాశమున మేఘములు ఉబ్బుకొనుచున్నవి, గాలివాన రానున్నది; సముద్రము ఘోషించుచున్నది. ఉచ్ఛ్వసిత నీలసింధూ! నీకల్లోలముముందర మనుష్యునికంభ మేపాటి? కాలపరిణామములు నిన్నంటజాలవు! పెరుగుటావిరుగుటయు నీకులేవు. అనంతాకాశమునుబోలు నీనీలగాత్ర మెంతమనోహరము! అనాదియగు గానము నీయందు లీనమైయున్నది. మృదుమందనిశ్వాసముల కెరటములను కరములతో పృథ్వీకాంత నుపగూహన మొనర్చుచుంటివి. నీకొకరి లక్ష్యమున్నదా? కాలక్రమమున సృష్టియంతయు నెట్టిపరిణామములకు బాలైనను నీవుమాత్రము జెక్కుచెదరవు. అనాదినుండియు నీదారినీది. సర్వస్వతంత్రము కలదానవు స్వైరవిహారమునకూ ఉదారతకునూ నీవ పెట్టినపేరు. పైన మేఘనిర్ముక్తనీలాకాశము క్రింద నీస్వచ్ఛప్రతిచ్ఛవి! సూర్యచంద్రాదిగ్రహములు ససంఖ్యాతారాగణము నీలోన నిమిడ్చితివి. అగాధమగు నీయుదరకుహరము వెలలేనిరత్నముల కాకరము. ఉన్మత్తములగు గాలివానలయం

దుచ్చలితతరంగ భంగములచే నీరాకృసపర్య ప్రకటిత మగుచున్నది. నీగురుగంభీరగర్జనము మేఘగర్జనమున కుద్ది. రాత్రివేళల నీపింగళ ఫేనమువిద్యుత్కాంతి నపహసింప జాలు పరివేషములగల్పించుచుండును. ప్రళయానిలక్షుభితమగుతుపాను ముగిసినతోడనే నీలత్వమై, స్థిరత్వమై, మానోదారభావముల నంబరవీథిని బురుడింతువు. నీచేష్టలు బహుళభయదాయకములు, నీవిక్రమ మ్ముద్దామము, ప్రమత్తము, నమోఘము. ప్రళయాంతమున నిన్ను జూచు భాగ్య మేమహానుభావుల కబ్బునో కదా?

మాటలసందడిని కర్తవ్యము మఱచితిని. ఇదే మాయూరు; ఇందుజొచ్చి మాయమ్మను దర్శించి నాజనకుని వృత్తాంత మరసెదను (పోవును.)

(తల్లియు కొడుకును ప్రవేశింతురు.)

పంటి—వలదు. నీ చేతినీరు త్రాగను. నాతండ్రి వృత్తాంతము నెరుంగుటకై వచ్చితిని.

అహా—నేను నీతల్లిని కానా? మాతృప్రేమ ప్రతి వారిని ఋణబద్ధుల జేయదా?

పంటి—ప్రేమయా? ఋణమా? నిజము. నన్నుకని బికారినిజేసి పట్టెడన్నమునకు పశువునుభాతి నమ్మి నేడు ప్రేమఋణము దీర్పుమనుటకు నీకు నోరెట్లు వచ్చెను? నీకు సిగ్గులేదా?

అహా—నేను జేసినది తప్పే. నిక్కముగ నన్యాయ

మొనర్చితిని, దాని సైరింపరాదా? కుమారా! దారిద్ర్యబాధ భరింపలేక యుజ్జ్వలనుగు తాపమున వెఱ్ఱియెత్తి యట్టికార్యా కర్మ మాచరించితిని. నా బాధ నీకు భావనాతీతము. అనంతర మెన్ని దీర్ఘదివసము లెన్ని నిద్రాహీనములగు రాత్రులు వేచికన్నీరు వార్చితిని! నీముఖము స్మృతికి వచ్చునప్పుడెల్ల ప్రపంచము నాలోచనపథమునుండి లోపించుచుండెను. నిన్నమ్మి పట్టెడుకూడు నోట వేసుకొంటినే గాని యది నాతప్తశ్వాసమందలి వేడిమిచే భస్మమయ్యె, ఆకలిబాధ భరింప శక్యము కాకుండె, నాయనా! నాబాధ నీ వెరుంగగలవు?

ఏంటి——నేనుపడెడు గాఢవ్యథ నీవెరుంగగలవా? మర్మభేదియగు మనోవ్యాధిచే మతిపోయి, ధూమకేతుసదృశ వేగమున ప్రపంచమున నెట్లుతిరిగితినో నీకెట్లు తెలియగలదు? సింహగర్జనము, వ్యాఘ్రభీకృతి, అగ్నిశిఖ, ప్రళయాంబుదనిర్ఘాతము, కరకావృష్టి, ఖడ్గధార - మొదలగువాని దృణీకరించి శస్త్రోపజీవినై యనేక దేశముల గ్రుమ్మరి- ఏవ్యథ కాగలేక యర్థఖండవ్యాప్తమగు పృథ్వీభాగమున పల్లటిల్లి నీయొద్ద జేరితినో నీ వూహింపగలవా? నారీ! నా తండ్రి యెవరో చెప్పుము

అపా——చెప్పను నాగుము.

ఏంటి-ఆగుటవలన బ్రయోజనమేమి? నాతండ్రియెవరు?

అపా——ఈముఖము నెన్నిసారులు స్వప్నమందు గాంచితిని! చిన్ననాడు దీని నెన్నిసారులు తృప్తితో ముద్దాడితిని,-

ఏంటి——చెప్పవేమి నాతండ్రిపేరు?

అపా—నీకింత కిన్కయేల? నీకు నే నేమియు కానా?

ఏంటి—నాకూనీకూ ఇక సంబంధమెక్కడిది? దానిని నీవే చేతులార ఛేదించి ప్రపంచమున నికృష్టతమమగు పైశాచిక కర్మ మాచరించితివి. కన్నకుమారుని కాసున కమ్మితివి.

అపా—కావుననే క్షమింపుమని వేడుచున్నాను. క్షమింపకున్న నొకసారి "అమ్మా" అని పలుపుము. ఒక్క సారియే. ఇక కోసరను.

ఏంటి—ఇంతదూరము వచ్చుట నీయేడ్పు వినుటకా? నాతండ్రి యెవరో చెప్పుము.

అపా—నాకూనీకూ నేసంబంధమును లేదా?

ఏంటి—ఏమియూ లేదు.

అపా—పదినెలలు నిన్ను మోసితిని, పాలిచ్చి భుజము పైత్రిప్పి యాడించితినే?

ఏంటి—ఏమిదయ! గొంతుపిసికి గోతబెట్టవైతివి, ఏమి యభిమానము? నన్నేల చంపక పోయితివి? అమ్ముట కన్న నమ్ముచేసిన మేలగునే!

అపా—అయ్యో! కుమారా!

ఏంటి—కాలయాపనము సైపనోప, నాతండ్రి యెవరో వేగజెప్పుము; లేకున్న నాకు మతిపోవు నట్లున్నది. నాజనకుని పేరు చెప్పుము; లేకున్న నలతి వోవువాడగాను.

అపా—అట్లైన నీతండ్రిపేరు నేనుచెప్పకుండుట కొక

కారణ మున్నది- అతడే యీవృత్తాంతము వెల్లడిసేయవల దని నన్ను నిరోధించెను. మాకు వివాహ మగుసరికి-

ఏంటి—వివాహమైనదా?

అపా—నాకు పదునైదు వత్సరములు. ముగ్ధనుకావున నాతఁ డెట్లుబోధించిన నట్లు నడుచుచుంటిని. మావివాహము రహస్యముగా జరిగినది.

ఏంటి—విధియుక్తవివాహ మా యెకదా? నాకదియే పదివేలు.

అపా—నీవు జనించిన కొన్నినాళ్ళ కాతఁడొక గొప్ప యింటిపిల్ల నుద్వాహమై నన్ను విడిచెను.., ఆహా! పురుషు లెంతమాయాశీలురు! ఎంతకఠినాత్ములు!

ఏంటి—వివాహ మయ్యెకదా! హాలెక్! నిన్ను గాంక్షించుట యట్టి దురాశ కాదుసుమా! సెల్యూకస్—

అపా—ఎవని పేరెత్తితివి?

ఏంటి—ఏమీ? సెల్యూకసు పేరు—కిచ్చపడెద వేల?

అపా—ఆపేరు నీకెట్లు తెలిసె? ఇంతవరకూ నానోట రాలేదే?

ఏంటి—ఏమి? సెల్యూకసు నెరుంగని యవను డుం డునా! ఆతఁడు ప్రాచ్యయవనసామ్రాజ్యమునకు సార్వభౌ ముడు. ఆతనిక్రిందనే సేనాధ్యక్షుఁడనై యుంటిని.

అపా—అతని యొద్దనే యుంటివా? నిన్నాతఁడు పోల్చుకొనలేదా?

ఏంటి.—పోల్చుకొనుటయా? ఏమంటివి?

అపా—అతడు నిన్ను గుర్తింపనేలేదా? ఎట్టి కఠినుడు? తమబిడ్డలను పోల్చుకొనజాలని పురుషు లుందురు కాబోలు? నేను లక్షశిశువులనుండి నాశిశువు నెంచుకొనగలను. ఆత డెంత పెద్దవాడైనను సరియే, ఆతని నెన్నిదినములనుండి చూడకున్నను సరియే.

ఏంటి.—ఏమిటి! పిచ్చిదానివలె వాగుచుంటివి!

అపా—లేదులేదు. పిచ్చిదానగాను, ఇంతజరిగిననూ నాకు పిచ్చియెత్తకుండుటకు హేతు వ్యూహింపలేకున్నాను. ఆతడు సార్వభౌముడు; నే నాతనిధర్మపత్నిని, పట్టమహిషిని-ఇల్లాలను. మార్గమధ్యమున బికారినై జానెడుపొట్ట నింపించుకొనుటకు బిడికెడుకూడు లేక యాకలిబాధ నోరువజాలక కన్నకుమారుని కానన నమ్ముకొని-ఎట్టి దుర్గతిపాలైతిని!

ఏటి.—నీమాటలు నాకు బోధపడుట లేదు—సార్వభౌము డెవరు? ఇల్లా లెవరు?

అపా—కుమారా! ఆసెల్యూకస్ నీతండ్రి. (ఏంటి యొక్క సామెపాదములపై బడును)

ఏంటి.—అమ్మా! అమ్మా! నన్ను క్షమింపుము. నీయెడ ననుచితముగ వర్తించితిని. మోటుమాట లెన్నియో నాడితిని-అమ్మా! నీవు పరిత్యక్తవా? ఎంతదౌర్భాగ్యులము!

అపా—నాయనా! ఇదంతయు నాతనిపని, నావల్ల దోసమేమియూలేదు, ఆతడు నన్ను విడిచెను: నేను బీదదా

నను, అదియే నాయందలిలోపము-పోని మ్మాతనిమనసునకు నేను దౌర్భాగ్యురాలనైనను- నీకు తల్లిని- ఏదీ ఇంకొక్క-సారి "అమ్మా" యని పిలువుము. అంతతో నాకష్టములు-నామనోవ్యాధి-పీటినెల్ల మరచెదను. అన్నిటిని మరచి యాపిలుపునే యాదినుంచుకొనెదను.

ఏంటి—రాజమహిషినగు నీకా యిట్టిపాటులు ? అమ్మా ! అమ్మా !

అపా—ఆహా! నాచెవులు చల్లనాయె- ఈమాట వినుటకే ప్రాణముల నిన్నాళ్ళు బిగబట్టితిని ! తండ్రీ ! ఏది ? ఇంకొకసారి.

ఏంటి—అమ్మా ! అమ్మా ! ఇదేమి యిట్లు వణకుచున్నావు?

అపా—చాలును- ఇదే నాకు స్వర్గము ! ఇదియే నాకు మోక్షము- ఇంక నాకేమియూవలదు. నాతల తిరుగుచున్నది. ప్రాణములు నిల్చునట్లు లేవు. పోనిమ్ము, బ్రహ్మానందమాయె. నేధన్యనైతి. నాయనా ! ఏంటియోనక సెక్క-డనున్నావు!?

ఏంటి—అమ్మా ! నన్నువీడి పోవుచుంటివా !...

(లోనికి దీసుకొనిపోవును)

—

## ఐదవ రంగము

(మహలులో చంద్రగుప్తుడు)

చ॥గు—మృత్యుదేవత నాప్రజలను సేననూ నాశత్రువులలో జేర్చెను. ఇంటిలో శత్రువులు, బైట శత్రువులు, ఇక జీవించుట కష్టము. ఇది ప్రకృతిప్రతిశోధయై యుండును. ప్రకృతి ప్రతీకార మొనర్చకుండునా? నాహితైషుల శత్రువులని భ్రమగొని దేశమునుండి వెడలగొట్టితిని, వారేయిందున్న నింతకు వచ్చునా? మహాభిమానముతో బాంధువగుడు నన్ను వీడి పోయెను. ఆసమయమున నాతడు కన్నీరు నించుచూ సాభిమానముగ నాపై సారించిన దృష్టు లిప్పటికిని జ్ఞప్తియందున్నవి.. చంద్రగుప్తా! నీవెంత కృతఘ్నుడవు! నిలువనీడ నొసంగితి, సేననిచ్చితిని, నీకై ప్రాణముల నైన వీడుటకు సిద్ధడనై యుంటిని, నీప్రాణముల గాపాడితిని; మగధరాజ్యమున కధిశుని జేసితిని, దాని కిదియా పురస్కారము" అని చంద్రకేతు తలంచియుండడా?.. చంద్రకేతూ! చంద్రకేతూ! నాకంట బడితివా, నీపాదములంటి, సామ్రాజ్యము పోనీ—ప్రాణములు పోనీ—నీవు క్షమించిన చాలును—నీవు క్షమించితివని వినినజాలును." అని వేడుకొందును...పోనీ—సామ్రాజ్యము పోనీ—నేను యుద్ధము సేయను. నేనే నాపై కసి తీర్చుకొందును. మగధసామ్రాజ్యము మేఘములచే గట్టబడిన మింటిమిద్దివలె శూన్యముకానీ! నాకేల. యీక్షోభ?

(సైనికుడు వచ్చును)

సేవ—మహారాజా! మనదక్షిణపుకోట భగ్నమైనది.

చ॥గు—మంచిపని జరిగినది. పొమ్ము...ఏమి! నావైపట్లు చూచెదవు?

సేవ—శత్రుసేన కోటలో దూరినది.

చ॥గు—దూరనీ! పొమ్ము. (వాడుపోవును)...నేను యుద్ధము చేయను. ఎవరికొరకీయుద్ధము? నాకు దగిన ప్రాయశ్చిత్తము నేనే కావించుకొనెద. ఆత్మహత్య చేసుకొందును. (మరియొకడు వచ్చును)

సేవ—మహారాజా!

చ॥గు—నీవెవడవు? పొమ్ము:

సేవ—శత్రువులు—

చ॥గు—శత్రు వెవడు? ఎవడుగూ శత్రువుకాడు. అందరును నాకు బరమ మిత్రులు...రానిమ్ము...పొమ్ము...

(వాడుపోవును)

ఎవడు శత్రువో, ఎవడు మిత్రుడో యెరుగను. ఇంటిలో శత్రువు- బైట శత్రువు విశాలమైన నదిపై తుపానుపట్టినది, ఈయోడకు కర్ణధారుడులేడు, అరిత్రంబునులేదు. ఎత్తైన తరంగములచే దెబ్బలుతినుచు, కొట్టుకొనుచూ, ఓరుగాలియందూగులాడుచున్నది. ఇక మునిగిపోవును, ఆలస్యములేదు... ఏమి యానందము! సలహా నిచ్చుటకు చాణక్యుడు లేడు. చావు దప్పించుటకు చంద్రకేతు లేడు.

(మూడవ సైనికుడు వచ్చును.)

ఇదే యింకొకడు! వీరికి వేఱుపని లేదు గాబోలు.

సైని—మహారాజా!

చ॥గు—మహారా జెవరు: ఇక్కడ మహారాజు లేడు. పొమ్ము (వాడుపోవును.)

(బైట తూర్యధ్వని)

ఈధ్వని యెచ్చటిది? ఇంత రాత్రివేళ నిది యెట్లుకలిగె? ఏమిది? ఓహో! యుద్ధకోలాహలము కాబోలు? యుద్ధము. ఎవ్వరి కెవ్వరితో యుద్ధము? ...ఓహో! మరల వినవచ్చు చున్నది....చంద్రగుప్తా! నీవు బ్రతికియుంటివా? లేక చచ్చి తివా? ఈకోలాహలము వినుచుండియు నిర్జీవప్రతిమవలె నిం టిలో గూర్చుంటివా? అదే! నీసేన యుద్ధము చేయుచున్నది, లెమ్ము. వీరుడవో? అగాధనిరాశను వీడి మెఱుపువలె యుద్ధ భూమి నవతరింపుము. ఈయోరుగాలి ఝంకారమును మించి నీసింహనాద మొక్కసారి సైనికుల చెవుల సోకనిమ్ము.పిమ్మట నంతయూ పరిశయకల్లోలమున మున్గనిమ్ము. జే! మగధకుజే!

(మురి వచ్చును)

ముర—చంద్రగుప్తా! ఇదియేమి?

చ॥గు—అమ్మా! నాకు సెలవిమ్ము. నేబోయెదను.

ముర—ఎక్కడకు?

చ॥గు—యుద్ధమునకు. యుద్ధభూమిని ప్రాణముల విడిచెదగాని బద్ధసింహామువోడ్కి ముక్కలుముక్కలుగ శత్రు

వుజేయు క్షత్రవధ సహింపజాలను. నక్షత్రముక్తాఖచిత నీలా కాశము పందిరిగ నాసేనాముఖము పెండ్లిపీటగ విజయలక్ష్మి నో లేక కీర్తికాంతనో పెండ్లియాడెదను.

ముర—కుమారా! మొదటిదే కానిమ్ము. శత్రువు వచ్చెగదా? యుద్ధము సేయుము, వీరుడవు గాన జయము నీకు కరగతమగును.

చ॥గు—అంతకంటె వేఱుపాయము లేదు. బైట శత్రువులు--లోన శత్రువులు--ఎవడు శత్రువో, యెవడు మిత్రుడో, యెరుగజాల. శత్రుసేనాసముద్రము---

ముర—దాని నీవు తరింపగలవు.

చ॥గు—అదెట్లు నిర్ధారితమగును? నేను ప్రాణములు త్యజించుటకును సిద్ధుడనే, అదే! యుద్ధకోలాహలము. సైనికులారా!

సైని—(లోపలనుండి) మహాప్రభూ ఏమియాజ్ఞ?

చ॥గు—నే నిదే సమరభూమి నురుకు చున్నాను. నాయంగరక్షకుల సిద్ధపరుపుడు. (తెరలో) మహారాజ చంద్ర గుప్తునకు జే!

ఏమిది? ఏమి వింటిని, నాకుజయమా? నాకేమి మతి భ్రమించినదా! కాదుకాదు. నాశత్రువులే వ్యంగ్యభావమున నిట్లుపలుకుచున్నారు. నన్ను జూచి హాస్య మాడుచున్నారు. ఇంకెక్కడి జయము? చంద్రగుప్తుని జయమంతయు చాణక్య చంద్రకేతులతోడనే పోయినది. ఏమిది? ఇంకను దగ్గరపడు

చున్నది? పరిచిత స్వరమువలె దోఁచుచున్నది. ఎవరిది?

(రక్తసిక్తాంగులై ఛాయాచంద్రకేతులు చాణక్యుఁడు వత్తురు.)

ఏమి? స్వప్నమా? లేక సత్యమా? నాకన్నులయెదుట నమృతవర్ష! నాపోష్యజనకుఁడు. ఆహా! నేధన్యుఁడను. గురూత్తమా! అభివాదనము. సోదరా! నాతప్పుసైరింపుము. నన్నుఁ గాన వచ్చిన మహానుభావులారా! మిమ్మెట్లు ప్రస్తుతింతును!

చ॥ కే.—సోదరా! గురుదేవుని చరణములపైఁబడి కొని వచ్చితి. ఇఁక భయము వలదు.

చ॥గు. }
ముర } గురుదేవా! రక్షింపుము.

చాణ—మురా! చంద్రగుప్తులారా! లెండు. చాణక్యుఁడు చచ్చినవారిని బ్రతికింపజాలఁడు గాని తదితరము నిర్వహింపఁగలఁడు. చంద్రగుప్తా! యుద్ధమునకు సిద్ధుఁడవు కమ్ము. యవనులన నీకెంత? చాణక్యసృష్టిని ధ్వంసము సేయఁగలు సామర్థ్య మెవరికి గలదు?

చ॥ కే.—సోదరా! ఇట్టి యాపత్కాలమున వక్షము లొండొంటి నొరయునట్లు గాఢాలింగన మిమ్ము. మనపై పర్వతము పడినను తుత్తునియలు గాదా?

చ॥గు.—చంద్రకేతూ! ఆపద్బాంధవా! సోదరా! (కౌగిలించుకొనును)



## ఆరవరంగము

---

(ఛాయయు నామెసఖులు)

ఛాయ—సఖులారా! ఒకసారి యాడుచు పాడుడు. నేనును మీలో జేరెదను. చంద్రగుప్త మహారాజు యవనుల నోడించెనట. ఏమిశుభవార్త!

సఖు—ఛాయాదేవీ! మన మాడుచూ పాడుచుండుట వలన నేమి ప్రయోజనము? అతడు మనయాట జూచెనా! పాట వినెనా?

ఛాయ—మనపాట మన కానందజనకము గాదా? ఆతడు విన్న నేమి? వినకున్న నేమి? వసంతాగమమున మలయా నిలము వీచునపుడు ప్రకృతియందలి కిసలయములూ పుష్ప ములూ తమంతట వికసించుటచూడమా? ఒరులచూచినను జూడకుండినను వాటి కేమి లెక్క? లేమావిగున్నలందూ లతా కుడుంగములందును కోకిలలు పంచమస్వరమున బాడుచుం డును. ఒకరు విన్నారనికాని, వినలేదని కాని వాటికి దెలి యునా? వాటియానందమున నవి యోలలాడుచుండును.

సఖు—ఛాయా! నీ వాతని వలచితివికదా! ఆతడు గూడ నిన్ను ప్రేమింపవలయునని కోరవా? నీకు ప్రతీకార వాంఛ లేదా?

ఛాయ—నాప్రేమాంబుధిలో నే మున్గియుంటిని, నా యొడలంతయు ప్రేమసిక్తమాయెను, వలపుటలలపై నా జీవన

ఛాయ—పురుషులకు నారీచిత్తపరీక్ష కావలయునా? వారు కోరునది రూపమే!

సఖు—మోహాముగ్ధులగు వారి కుచ్చనీచములు దెలియునా?

ఛాయ—నే డుత్సవదినము కావున నానందాంబుధి నోలలాడుదము. రాత్రియంతయు జాగారము సేయుటచే వాడియున్న మీముఖారవిందములు ప్రాతస్సూర్యుని హేమ కరకాంతిచే నరవికసితములగువరకును, ప్రభాతోత్థిత విహంగ కలకలము మీగీతములకు శ్రుతియగునంతదనుక నాడుచూ బాడుచు నానందింతము. అందరిని బిలువుము.

(మురదూరమునుండి)

ముర—అయ్యో! ఛాయా! ఉత్సవములం దోలలాడు చుంటివా? పాపము! నీయన్న చంద్రకేతు వీయుద్ధమున మడియు టెరుగవు కాబోలు! తెలిసియుండిన—లేదు లేదు...అయొా! ఈదుర్వార్త నేనెట్లు చెప్పుదు? ఛాయా!

ఛాయ—ఓహో! మురాదేవియా? అభివాదనము. చంద్రగుప్తునకు సేమమా?

ముర—ఆ! సేమమే, కాని యొకమాట.

ఛాయ—ఏమి సెలవు?

ముర—ఛాయా! ఇన్నినాళ్ళకు నాజన్మము సార్థకమయ్యె! నాజీవితపరమావధి లబ్ధమయ్యెను. అమ్మాయీ! నీవిక నాకు గోడల వగుదువు. భారతవర్షమునకు సామ్రాజ్ఞి వగుదువు.

ఛాయ—రాజమాతా! చంద్రగుప్తుని పత్నీత్వమూ భారత సామ్రాజ్యమునూ నాకువలదు, మా రాజ్యమే మాకు చాలు: చంద్రగుప్తుడు సార్వభౌముడైననూ ఛాయయు నొక రాజకన్యయే! మీరు చెప్పిన లాభమేమి?

ముర—అదే మట్లనుచుంటివి? నేనెప్పుడైన నిన్ను పరిహాసించితినా? నేనుచెప్పునది సత్యము! సత్యము! సత్యము!

ఛాయ—దేవీ! అదియే నిజమగునా? నాకంత సౌభాగ్యమా? ఇంతయాకస్మికము! ఇంతతీవ్రమా? దేవీ! దేవీ!

ముర—ఇదేమిఛాయా? కనుదోయింబడి బాష్పములు దొరగుచున్నవి.

ఛాయ—అమ్మా! ఇవి మోదాశ్రువులు! నేనేడ్చుట లేదు. దేవగణములారా! పుష్పవృష్టి గల్పింపరేల? ఏమిది? ఆకాశ మత్యంతనీలము నతిగాఢము ప్రోజ్వలితముగ గన్పడుచున్నది- నేనుస్వర్గమున నున్నానా? భూలోకముననున్నానా? కుసుమశయ్యపై శయనించియుంటినా, లేక మలయానిలమున నోలలాడుచుంటినా? నే నెక్కడనున్నాను?... దేవీ, మిమ్మొక్కటి యడుగవచ్చునా? నా ప్రేమకు నేకలక్ష్యముగు చంద్రగుప్తు డీతడేనా? ప్రాణేశ్వరా? నాజీవనసర్వస్వమా! నాపరదేవతా?... నన్ను క్షమింపుము. నే నెవ్వియో కారులు వల్కుచుంటి- అభాగ్యురాల- పితృమాతృహీనకన్యను నా దోషముల సైరింపుము. ఇంతసుఖమును నన్ను ద్రోసితివి కాని దీని స్వప్నముగాకుండ నొసర్పుము. (నాగకన్యలు వచ్చుదురు)

చాణ—మురా, ఇదంతయు నేమిటి ?

ముర<br>ఛాయ — } విజయోత్సవము గురువరా !

చాణ—ఓహో ! మురా ! యవనులతోడి సంధి కేర్పాటులు గావించితిని. సంధిపత్రమున సంతకములే కొరత.

ముర—షరతు లెవ్వి ?

చాణ—చంద్రగుప్తమహారాజు సెల్యూకసునకు ఏనూరేనుగుల నిచ్చునట్లును, దానికి మారుగ సెల్యూకసు పారిపనిసదే పర్వతములకు దూర్పున దక్షిణమునను తానిది వరకు జయించిన రాజ్యముల మనకిచ్చునట్లును, ఈసంధి శాశ్వతముగా నిలిచియుండుటకు సెల్యూకసు తన కూతురిని మహారాజునకు పెండ్లి సేయుటకును నిశ్చితము చేసితిని.

ముర—ఇదేమి ? గురువరా ! యవనసార్వభౌముని కూతురు నాకోడలా ? వలదు. నాకోడలిది—(ఛాయను కౌగిలించుకొనును)

చాణ—ఇది చాణక్యుని యుక్తి.

ముర—కడుదుఃఖదాయకము, సంబంధప్రతికూలము.

చాణ—కాని రాష్ట్రక్షేమమున కిది యవశ్యకర్తవ్యము, కావున తుచ్ఛమైన స్వార్థమును ఛాయ బలియొసంగ సమర్థురాలు. రాష్ట్రక్షేమము మనసమలోభనీయము కాదా ?

(వెళ్ళును)

ఛాయ—తుచ్ఛమే!— స్వార్థము పరమనీచమే,

కాని బ్రాహ్మణోత్తమా! నీవు నాక్షోభ నెరుంగగలవా! అట్లుకాదు... పురుషునిదృష్టికి స్త్రీజనసుఖదుఃఖములు జీవితమును తుచ్ఛములే. హా! పరమేశ్వరా! నీనవయూహా!... ఏమినీసృష్టి! ప్రేమ, మృత్యువు; ఆశ, నిరాశ; స్వర్గము, నరకము — వీటికి నేకత్రకల్పన మొనగూర్చితివా?... పృథ్వియంతయు గిఱ్ఱుగిఱ్ఱున దిరుగుచున్నది. ఆకాశమున బ్రవీనక్షత్రమునగా సూర్యునిభాసి చండకిరణములు ప్రసరింపుచు తక్షణమే ప్రభ దొరంగుచున్నది. యశోగాథామృదంగధ్వనికి తాళమోయున దీర్ఘనిశ్వాసము నిర్భాగ్యత నగుచున్నది... అదే అదే...(కఱ్ఱగట్టును)






పంచమాంకము.



మొదటిరంగము.

(యవనశిబిరము.)

సెల్యూ—అసభ్యుడగు చంద్రగుప్తుడు యవనసార్వభౌముని కూతురును పెండ్లియాడుటయా? బంధమోచనమునకై నేను హేయమగు నీసంధి నొనరింతునా? చేయజాల. చేయజాల.

హెలె—తండ్రీ! ఇప్పుడు నీకు దర్పము శోభస్కరము కాదు. ఈతరుణము మించెనా యవమానము తప్పదు. ఇంక నా ప్రగల్భము లాడుచుంటివా: సిగ్గునకు చేటు.

సెల్యూ—జయింపవచ్చితిమి, ఫలము లేకపోయి. సిగ్గుపడనేల?

హెలె—ఎవరిని జయింప వచ్చితివి? చంద్రగుప్తుడు నీకేమి యపరాధ మొనర్చెను? మీతోడ నతడు ప్రయత్నపూర్వకముగ జగడము పెంచుకొనెనా? ఆతడు సింధునదియావలియొడ్డున నిశ్చింతతో నెమ్మదిగా రాజ్యపాలనము సేయు

చుండ నీవది సహింప నేరవైతివి. నీకు బరాజయము సిద్ధమని మొదటనే చెప్పియుంటినే? నామాట వినవైతివి, తగినశాస్తి యైనది.

సెల్యూ—విజాతీయులయెడ నిట్టిప్రసన్నత నీకెట్లలవడెను? వారు మాపీచమడచుట నీకు సమ్మతమా!

హెలె—ఆహా! సమ్మతమే. ఏల కాగూడదు? యవనులు పరాజితులైరి, ధర్మము జయించెను. జనకా! సుప్రతిష్ఠిత రాజ్యశాంతిని భంగము సేయ నుద్యుక్తుడగువాడు విదేశీయుడును శత్రువే కానిమ్ము, స్వదేశీయుడును మిత్రుడే కానిమ్ము, మహాపాతకి, యనబడును. నిరపరాధినులగు తల్లుల బుత్రహీనలుగను, అస్వతంత్రలగు బాలికల బితృహీనలుగను, సాధ్వులగు నారీమణుల భర్తృహీనలుగను జేసి, దేశమంతయును భయోపహతమగున ట్లొనరించి, కుత్సవృత్త్యావేశులై సర్వనియమముల నుల్లంఘింప జూచుట కేవల విజయకాంక్షచే గదా? ఇదంతయు మీకు చెలగాట కావచ్చును, కాని యింతకన్న మహత్తర పాపమున్నదా?

సెల్యూ—నేనట్టిపాపి—

హెలె—కావుననే తత్ఫల మనుభవింపుము.

సెల్యూ—యుద్ధమున నొకప్పుడు జయము, నొకప్పుడు పరాజయమును కలుగుచుండును. ఇప్పు డపజయము ప్రాప్తించె. ఈచెరనుండి ముక్తి కానిమ్ము, మా పరాక్రమము జూచెదవుగాక,

హెలె—నిన్ను జయించినవారి నసభ్యులని దిట్టుచూ వారి నేవగించుచుంటివి, కాని, వారు నిన్ను దయదలచి విడుతు రని నమ్మికతో నుంటివో? తండ్రీ, నీప్రతిజ్ఞ యేమయ్యె? "జయమో, మృత్యువో" అనుచుంటివే? ఓహో! ఎట్టి యధః పతనము?

సెల్యూ—హెలెన్,హృదయశూలాయమానములగు మాట లాడుచుంటివి! ఇది నాదౌర్భాగ్యదేవత పరాకాష్ఠ! ఇంతకంటె నెక్కుడేమగును? విజయయాత్రకై దేశమును, రాష్ట్రమును,బంధుగులను, విడిచి వచ్చితిని, కాని తల్లిలేని పిల్లవు పెంచితి పెద్దజేసితిని కావున నిన్ను విడువలేక వెంట గొని వచ్చితిని. అట్టినీవు నా విధిప్రతికూలతచే గాబోలు నిట్టిమాట లాడుచుంటివి? ఈపరాజయమువలన గలుగు దుఃఖము నా హృదయము నంతగా వేధించుటలేదు సుమా!

హెలె—తండ్రీ; నాతప్పు సైరింపుము. నిజమాడిన నిష్ఠురము తప్పదు. (మ్రొక్కును)

సెల్యూ—నిన్నననేల? తప్పు నాయది.

హెలె—అట్లుగాదు, నేనే దురభిమానమున క్రోధ మావేశింప నోటికివచ్చినట్లు కారులరచితిని, తప్పునాది; ఈకోపము పిల్లలయెడ దల్లిజూపు కోపమువంటిది. కటువగు నీహాలాహలము ప్రేమయను క్షీరసముద్ర మథనమున వెలువడినది. నేను నీబంధమోచన మొనగూర్తును. నీవు తగిన యదను నిరీక్షించి యవనవాహినీపరాభవసమ్మార్జన మొనర్పుము.

సెల్యూ—నీవు నా చెర నెట్లు బాపుదువు?

హెలె—చంద్రగుప్త బెండ్లియాడెద.

సెల్యూ—వలదు! వలదు! కుమారీ! ఈపాడుచెరవి ముక్తికై యమూల్యవస్తువు నమ్మికొందువా?

(చంద్రగుప్తుడు వచ్చును)

చ॥గు—యవనసార్వభౌమా! నీవేమియు నమ్మనక్కరలేదు. వీరవరా! నీవు ముక్తుడవైతివి! నీకు వీలుకుదిరిన నింకొకసారి నారాజ్యముపై దండెత్తుము. చంద్రగుప్తుడు కదనకుతూహలుడై యెపుడు సర్వదా సిద్ధుడు. వీరోత్తమా! నీవును నీకుమార్తెయు మీ రాజ్యమునకు మగుడవచ్చును.

సెల్యూ—ఇదేమి?

చ॥గు—యవనసార్వభౌమా! భారతీయులు బర్బరులు ననాగరకులుగారు; సికందరుసార్వభౌముడు మాపురుషోత్తము నెడ నగపర్చిన సౌజన్యమునకు తగినట్లు బదులు దీర్పనేర్తురు. మీరు ముక్తులు, నాకు సెలవిండు.

సెల్యూ—చంద్రగుప్తమహారాజా! నీవు మహాత్ముడవు, మెచ్చుకొంటిని. మున్నొకనాడు నాప్రాణముల రక్షించితివి, దాని నేను మరువలేదు. నేడు నిష్కామ్యబుద్ధితో నీచేత జిక్కిననన్ను విడిచితివి, ఇందుకు కృతజ్ఞుడను. మీరు నియమించిన షరతుల ననుసరించి ప్రకృతమున సంధి కొడంబడితిని. ఇంతతో మనకు వైర మంతరించునని యెంచకుము. ఇప్పుడు మీకొసంగవలసిన దేశముల నెప్పటికైన జయించి తీరెద; చివర

మరణమున కొప్పుకొనజాలను. విదేశీయుడవుగాన నీకు నాకూ తురిని బెండ్లి సేయనేరను.

హెలె—ఏల? హిందువులు గౌరవనీయులగు మానవులుకారా?

సెల్యూ—హెలెన్!...(ఆమె శిరమువంచును)

చ॥గు—రాజకన్యా! తెలిసె. నీవిపుడొనర్చిన మహాసమ్మానమును శిరసావహించితిని. వీరవరా, నీవు కన్యాదానమును చేయనుద్యుక్తుడవైనను దాని నేప్రతిగ్రహించుట కసమర్థుడను. నీకుమారీరూపలావణ్యగుణగణముచే మోహితుడనౌట నిజము, అదియు నీనాట గాదు. ఏనాడీమె యౌవనప్రాదుర్భావమున సింధునదీతటమందు నిదాఘసాయంసంధ్యాలోకమున నీమెబయకారముం గంటినో నాటినుండియు నామానస మామె యధీనమయ్యె. ఆనాటిస్వప్న మిట్లు సఫలమగునని కాని, నాజీవితపరమలక్ష్యము నాకిట్లు దక్కుననికాని యెంచనైతిని. ఆగౌరవము, స్వర్గసుఖము, నుత్సవము నాకు కరగతములయ్యు నాహస్తపీడనముచే గాబోలు నంతరించెను... సార్వభౌమా! నాప్రాణబంధువగు చంద్రకేతు ప్రాణావసానసమయమున దనచెల్లెల నాకర్పించి పోయె, ఆపెయే భారతవర్షసామ్రాజ్ఞి కానున్నది.

(ఛాయవచ్చును)

ఛాయ—ఇదిమహారాజుగారి దయాహిల్లోలము, కాని సార్వభౌమా! భవదనుగ్రహదత్తభిక్షను ఛాయ గ్రహింప

జాలదు. భారతసమ్రాటునకు యోగ్యురాలగు పట్టమహిషి యవనసమ్రాడ్దుహితయే ! యువతీవతంసమా ? చంద్రగుప్త మహారాజు నీయెడ ననురాగియైనాడు; నీసౌభాగ్య మెంతని కొనియాడుదు? స్వచ్ఛందమగు పూర్ణమానసముతో నాహృదయలతికాలవాలము- నాజీవితసర్వస్వము—నీ కర్పించుచుంటిని...(తడబడునడుగులతో హెలెనుచేతిని చంద్రగుప్తునకు జూపి) మహాప్రభూ! ఈయమూల్య రత్నమును మీవక్షమున శ్రీవత్సాంకునివలె ధరింపుడు, ఇది నాకు సర్వోత్తమమగు పదవి, ఈగౌరవమునకు భాజనమునగుటకు నేనేమి యర్పించుచుంటినో మీరలెరుంగరు. పోనిండు. మీరుసుఖులై యుండుడు. నాకదియే పదివేలు.

చ॥గు—ఏమి యీవిచిత్రము? ఛాయచిత్తవృత్తియొక తీరుగను చంద్రకేతుననురోధ మింకొక తెరగుననున్నది. ఏమి సేయనగును...సార్వభౌమా? మీరు ముక్తులుగాన యథేచ్ఛగా బోవచ్చును. నాకు సెలవొసంగుడు. (పోవును)

సెల్యూ—హెలెన్ ? ఇదంతయునేమి ?

హెలె—నాకేమియు దోపదాయె.

సెల్యూ—నీకు చంద్రగుప్తుని పెండ్లియాడవలెనని యున్నదా! అమ్మా !

హెలె—తండ్రీ! నీవనుమతించిన నట్లేకావించెదను.

సెల్యూ—అనుమతింపనా? స్వప్నమందైన నిట్లు తలపనైతి. ఇంతకు వచ్చెనా?

హెలె—ఈవివాహమున కేనెట్లు సమ్మతించితినో, తండ్రీ, నీవెరుంగజాలవు. తర్కవితర్కములచేతను, అనునయ వినయములచేతనూ సాధింపనేరనిదాని నేనీవివాహముచే సాధింపనెంచితిని, ఏమీ? చంద్రగుప్తుని న్ప్రేమింప గూడదా? ఆశౌర్యము, నాకరుణార్ద్రనేత్రరాజీవములు, ననంతమహిమాస్పదమగు నాతనిహృదయము నాకాంక్షామితంబులు కావా? వానిజూడ వలపుప్పుట్టదా? ఏంటియోకస్! నన్ను క్షమింపుము. పరమేశ్వరా; నాహృదయమును దృఢపరచి—నా కోర్కె నీడేర్పుము.



రంగపరంగము

(చాణక్యుని కుటీరము)

చాణ—మహాసముద్రము-తరంగములు లేవు-ధ్వని లేదు...అనంతము ... కనుజూపుమేర మృత్యుప్రాయమగు నిశ్చలత గానవచ్చుచున్నది... స్నేహాభావమువలన గలుగు లోటును క్షమ పూటుచేయగల్గునా? అట్లెన్నటికిని జరుగనేరదు. హృదయమందుద్భవించిన కోర్కెలు గైరికస్రోతముల వలె నుబికి వెంటనే భస్మీభూతములగుచున్నవి. తత్కారమున స్నేహప్రవాహము లుత్పన్నములై మస్తిష్కమందలి

యూగ్నేయశిఖలవేడిమిచే నావిరిగా మారి యాకసము నంటు చున్నవి! ఈప్రభాత మెంతమనోహరముగా నున్నది! ఏమి యగాధనీలిమ, ఎంత కమనీయచంద్రిక!

(భటులు కాత్యాయనుని కైదిగా బట్టితెచ్చెదరు.)

చాణ—ఓహో! సోదరా! ఇటురమ్ము.

కాత్యా—మహాత్మా! ఇట్టివేళ హాస్యమాడిన లాభ మేమి ? నేను మీకైదీని, అపరాధ మొనర్చితిని; దండింపుము.

చాణ—భటులారా! సంకెలల విడదీయుడు...ఇప్పుడు నీవు కైదివికావు-మనమిద్దరము తుల్యులము; భేద మావంత యును లేదు.

కాత్యా—భేదము లేకేమి ? మీరించుక కన్నుగీటిన నీభటులు విచ్చుకత్తులతో నాకంఠము నుత్తరింతురు. మీరు స్వేచ్ఛానువర్తనులు, నేను మీకు దాసుడ.

చాణ—మీరుపొండు. (భటులుపోవుదురు) కాత్యా యనా! ఈకత్తితో నన్నుపొడిచి వేయుము, అంతటనమాత్య పదవికి నీ కేయాటంకము నుండదు.

కాత్యా—ఆర్యా! మీయుద్దేశమేమి ?

చాణ—ఓయీ! నందసామ్రాజ్యమును నరణ్యమంత యగునరికి యనాసరక్షేత్రమును సస్యశ్యామలమగునట్లొనరించి చితిని, అది నీచేతకాదు. ఈరాష్ట్రమున శాంతి నుత్పాదించి తినే కాని యది స్థిరముకాదు. బాహ్యశత్రువుల భయముచే నరికట్టితిని. రాజ్యమందలి ప్రజలు చోరభయములేకసుఖులై

యున్నారు. కానియీ శాంతిసర్వము స్థిరముకాదు. దానికిజీవముతేదు. జీవము నే బోయజాలను. ప్రాయశః నీవదిచేయగలవు. మంత్రిత్వము నీవుగ్రహింతువన్న దాని నీకొసంగుటకు సిద్ధుడను.

కాత్యా—పండితోత్తమా! నీ వెంతచతురుడవు! నీ యభిసంధి యగాధము, దానిలోతు దెలియ నాబోంట్లకసాధ్యము.

చాణ—నేను చాణక్యుడ- ఇదే భగవత్సాక్షిగపల్కుచున్నాను, నీవు మంత్రివగుదువనిన నాపదవి నీకిప్పుడే యొసంగెదను. ఓయీ! నీవెంతమూర్ఖుడవైనను నీకుహృదయమున్నది కావున రాజ్యమును చక్కజేయగలవు.

కాత్యా—ఇదియేమి? బ్రాహ్మణప్రభుత్వమును సమర్థతయు నింతవరకుదెచ్చి, తచ్ఛిఖరము నధిష్ఠించి—

చాణ—ఇది వట్టిభ్రమ? హృదయ మాధిచే మడియుచుండ రాజ్యశాసన మెట్లునిర్వహింప నగును! నాకఠోరశాసనమున బ్రాహ్మణసామర్థ్య ప్రాసాదశిఖర మభ్రంకషముగ కాన్పించుచున్నను, స్వప్నసౌధమురీతి నదియ చిరకాలమున నదృశ్యమగును, నే నెరుగుదు; ఇది యిల్లుకాదు, యిటికలయావము, చెట్టు కాదు, ముండ్లపొద. బ్రాహ్మణసామర్థ్య సామ్రాజ్యము సమయనున్న సమయమున మంత్రబలమను కోటను గట్టి దానిరక్షించితిని, కాని బ్రాహ్మణునియందునశించిన బ్రహ్మత్వమును సృజింపజాలను. రచన రెండువిధములు.

పడగొట్టుట, కట్టుట, మొదటిది నాచేతనగు, రెండవది నాచేత గాదు; నీవలన నగునని నాకు నమ్మకము గలదు; నాపని పూర్తియైనది, శేషించినది నీది. కాత్యాయనా; బౌద్ధయుగ మను ప్రళయము రానున్నది! భావి నాకెట్లగ పడుచున్నదో తెలియునా?

కాత్యా—సెలవిండు.

చాణ—ఈసామ్రాజ్యము ముక్క-ముక్కలై దానిపై ప్రేతసమూహము భైరవాకారమున దాండవమాడుచుండును. పిమ్మట నొక మహాశక్తి వచ్చి నిజమాయాబలముచే తుత్తుని యలగు నామాంసపిండముల నేకత్రజేర్చి జీవముపోసి న్యాయ పరిపాలనచే నన్నిజాతులను సమానముజేయును. రమ్ము- మంత్రిత్వమును గొమ్ము.

కాత్యా—ఈమంత్రిత్వమునకు బ్రతిఫల మేమి కా వలయు?

చాణ—నీ మైత్రియే, వేరేమియు నక్కర లేదు.

కాత్యా—మహాత్మా! బాగుగ నభినయించిరి!

చాణ—సోదరా! నమ్మవేమి? ఇది యభినయము కాదు. నేను బహు దీనుడను. చాణక్యుడు కూటనీతిపటుడు, కుశలుడు, విచక్షణుడని జనులనుకొనుట నిజము. ఇప్పుడు భారతవర్షమున గల వివిధస్వరములనుగూర్చి యొక ఘనరాగ మును ప్రస్తరించితిని. భగవంతు డొకడున్న నాసృష్టిజూచి తప్పక యాశ్చర్యపడును. అంతయు జేసితినే కాని ప్రాణప్రి

తిష్ఠ చేయజాలనైతి. ఎట్లుచేయగలను ? బహిఃప్రపంచమందలి నాయద్భుతసృష్టిని మెచ్చుచుంటిరి, నాహృదయమును చీల్చి చూచిన నది యొక శుష్కమరుభూమి; అందు లేశమైన కారుణ్యము, స్నేహము, విశ్వాసమూ లేవు. ఈయూపిరి లేని తిత్తిని బెట్టుకొని యేమిసేయుమందువు ? ఈచింకిపాతను చీల్చివైతునా ? (వక్షమున గ్రుద్దుకొనును)

కాత్యా—వింతగా నున్నది. పండితోత్తమా ! ఇంత పిరికి వాడవా ? నీయటలప్రతిజ్ఞ, దుర్దమ తేజము, తీక్ష్ణబుద్ధి !—

చాణ—బుద్ధి ! బుద్ధి ! బుద్ధి ! వినివిని చెవులు చిల్లులు పడినవి. ఏ రేవున జూచినను, ఏ బాటబోయినను, ఏసంత కేగినను, ప్రపంచమందెల్ల నాబుద్ధిని మెచ్చుకొనువారే ! జనులందరూ భూకంపమును, ధూమకేతువును జూచునట్లు కన్నులు మూత వడకుండ విస్మయచకితులై నన్ను వీక్షించుచున్నారు. నేటి వరకు నాబుద్ధిని దేవవాణివలె ననుసరించుచుంటిని. అందు మూలమున నాకు మేలొనగూడక కీడు మూడినది. ఈసమయమున నాబుద్ధి పెడమోముపెట్టినది. దానిముఖము జూచితిని. జీవమే లేదు, వట్టితడక. ఇన్నిదినాలవరకు నన్ను నడిపించెను కాని, యిప్పుడేలొకో పరువులెత్తించుచూ అతిభయంకరమై దుర్నిరీక్ష్యముగా నున్నది.

కాత్యా—అయ్యా! పెట్టివాడ వయ్యెదవేల ?

చాణ—నాకు మతిలేదందువా!... ప్రాతఃకాల మెంత మనోహరముగా నున్నది! పృథ్వీకాంత నవవధువువలె

నలంకరింపబడి యున్నది. ఆమెముఖముపై బంగారుబాల సూర్యకిరణములు భగవదాశీర్వచన ప్రవాహమో యనునట్లు ప్రసరించుచున్నవి. నేను బిచ్చగానివలె ద్వారముకడనే నిలిచి దానిని జూచుచున్నాను. ఆహా! దరహాసితయగు నీపృథ్వీకాంత యెంత సుందరముగా నున్నది! ఎట్లుండిన నేమి లాభము? అనంతమగు తత్సౌందర్యసముద్రమును ప్రవేశింప దగనివాడ నేనొక్కడనే. అమృతప్రవాహము పొంగి పొర్లి వచ్చుచున్నది, కాని పొట్టవానివలె తప్తతృషితహృదయముతో దానియొడ్డున బడి కొట్టుకొనుచుంటిని. తపోవనమందలిసూకరమువలె గోతులలోని బురదలో దొర్లుచున్నాను.

కాత్యా—ఆశ్చర్యముగా నున్నది. ఇదివర కెన్నడు నిట్లుజూడలేదు.

చాణ—ఒకప్పుడు నాకు నీప్రపంచమంతయు నుత్సవమందిరమువలె నుండెను. పృథ్విపై సౌందర్యలహరి యుచ్ఛ్వసితమై ప్రవహించుచుండెను. ఆకాశ మింద్రధనస్సును బోలు కాంతులతో ప్రకాశించుచుండెను. పిమ్మట...అదే స్వనము అదియే కంఠధ్వని—సోదరా! కాత్యాయనా! వారి నిట బిలువుము.

కాత్యా—ఎవరిని?

చాణ—ఆబిచ్చగానిని వాని కూతురిని.

కాత్యా—ఏరీ?

చాణ—సోదరా! బైట నున్నారు. పొమ్ము. చిత్ర

ము. ఈ బాలిక స్వరము వినినతోడనే నా మన మలమట జెందనేల ?

(బిచ్చగాండ్రతో కాత్యాయనుడు వచ్చును)

కాత్యా—అయ్యా! వీరిని దోడ్తెచ్చితిని.

చాణ—ఇటురా, బాలికా! (శిరము మూర్కొని) ముఖ మదియేతీరు ! కన్నులు నట్లేయున్నవి! అంతయూ నా పోలికయే! బిచ్చగాడా! ఈపిల్ల నీకూతురా ?

బిచ్చ—(ఆతురముతో) అందుకు సందియ మేల ? బాబూ ! ఇది నాకూతురే.

చాణ—నిజము చెప్పుము, నీకు వలయునంత ధన మిచ్చెద, సత్యము పల్కుము.

బిచ్చ—కాదు బాబూ! నాకూతురు కాదు. ఈమాణిక్యము దారిలో పడియుండ నేను దెచ్చుకొంటిని. అప్పటినుండి యూ నాకూతురుగా బెంచుకొనుచుంటిని.

చాణ—అటులనా ? ఈపిల్ల నీకూతురు కాదా ?

బిచ్చ—కాదుబాబూ! భాగ్యవశమున నాకుదొరికినది.

చాణ—ఎక్కడ ?

బిచ్చ—భగవంతు డిచ్చినాడు. లేనిచో కన్నులులేని కబోదిని, నన్నూర దిప్పుటకు దిక్కెవరు ? పూర్వభవపుణ్య ఫలమున నీనిసువు నాకులభించె. అప్పటి నుండియు దుష్కృత్యమగు బందిపోటు దొంగతనము మానవలసివచ్చె, కన్నులు పోయినవి, నాయనా ! నాటినుండి నాకీబాలికయే దిక్కు !

చాణ—నీవుదొంగవా? ఇప్పుడాపనిని మానుకొంటివా

బిచ్చ—బాబూ! మానుకొనక తీరునా? నూరుతల లతో చాణక్యుడూ వేయికనులతో చంద్రగుప్తుడునూ రాజ్య ము నేలుచుండ దొంగలకు బ్రతుకు త్రోవయెక్కడిది?

చాణ—ఈ బాలిక నీ కెచ్చట లభించె నంటివి?

బిచ్చ—బాబూ! అవంతీపురమున.

చాణ—ఆపురమున నెచ్చోట?

బిచ్చ—మార్గ మధ్యమున.

చాణ—కాదు, ఒక బ్రాహ్మణు నింట దొంగిలితివి. నిజము చెప్పుము; భయమువలదు. దొంగిలించితివా? లేదా

బిచ్చ—లేదు బాబూ!

చాణ—నదియొడ్డుననున్న యింటిలో దొంగిలించి తివి. నిజము పల్కుము.

బిచ్చ—నిజము బాబూ! ఆయింటనే దొంగిలించితిని.

చాణ—హృదయమా! తల్లడిల్లకుము. ధైర్యమూ నుము. అప్పటికీ బాలిక ప్రాయమెంత?

బిచ్చ—మూడు నాల్గేడు లుండును.

చాణ—ఈమె పేరు?

బిచ్చ—అత్త్రియట.

చాణ—ఆత్రేయి! వింటివా? కాత్యాయనా! దీని యప్పటిపేరు ఆత్రేయి... ఈపిల్ల తండ్రిపేరు?

బిచ్చ—చాణక్యుడు బాబూ!

చాణ — ఓరీ! చోరాపనదా!...నిన్ను...చంపను ఏమియూచేయను. కాత్యాయనా!...వలదు. భటులారా... వలదు. బిచ్చకాడా! ఆబ్రాహ్మణుడను నేను! ఈ బాలిక నాకూతురు.

బిచ్చ — ఈ నిసువును తీసుకొందురా? బాబూ! నేను గుడ్డివాడను, నాకు కూడుదొరకదు, నే జీవించుటెట్లు?

చాణ — ఓరీ నీ కొకజాగీరు నిచ్చెదను. ఔరా! నీవు నన్ను బిచ్చగాని జేసితివి, కావున నిన్ను నేనురాజును జేసెద. ముందునన్ను నరకమున ముంచి పిమ్మట స్వర్గమునకు జేర్చితివి. నిన్ను దేవునివలె నారాధింతును...ఏమిది? ఇదిసంతోషమా? లేక దుఃఖమా?...కాత్యాయనా! నీకు నాడీపరీక్ష దెలియునా? నేను బ్రదికియుంటినో లేదో తెల్పుము. యిది యిహలోకమా? పరలోకమా? ఇది స్వప్నమా? సత్యమా! ఇది యుజ్వలకాంతి ప్రసారమా? లేక గాఢాంధకారమా? చూడు. లేనిచో నిన్ని దినములకు—నాకూతురు—భారతవర్ష శాసన కర్త్రి మహిత. నా గుమ్మమువద్ద బిచ్చ మెత్తుకొన వచ్చునా కాత్యాయనా!

కాత్యా — ఆర్యా! ఊరడిల్లుము.

చాణ — ఇదంతయు ద్రోహము-కపటము--కుట్ర... అదే ముఖము- అవే కన్నులు-అమ్మా! కుమారీ! ఇన్ని దినములు నీముదుసలి పెంపున నుండి వానిబెంచుచుంటివా? కతి

నురాలా! ఇన్నాళ్ళిక్కడనుంటివే!...కాత్యాయనా! ఉప వనమున సామగానము చెలరేగెను. ఆ గానానందవాహినిచే నాకు రోమాంచమేర్పడినది. గగనమునుండి స్నిగ్ధసౌరభ హిల్లోలము ప్రసవించి నాశరీరమును తాకుచున్నది....నన్ను ఆశ్రమములోనికి జేర్పుము. అమ్మా! ఇటురా!



మూ డ వ రం గ ము

---

(మలయరాజ్ఞీమంత్రి మగధరాజ దూత)

మంత్రి—మా రాజ్యము మగధరాష్ట్రమున జేరిననూ స్వాతంత్ర్యమును గోల్పోలేదు. చంద్రగుప్తసార్వభౌమునకు మా రాజకీయవ్యవహారములతో ప్రసక్తి లేదు.

దూత—మీ రాజకన్యకయే రాజ్యమును పాలించుచున్నదా?

మంత్రి—చంద్రకేతువు గతించినవెన్క నామెయే రాచకార్యముల జక్కబెట్టుచున్నది,

దూత—ఆమె కింకను వివాహము కాలేదా?

మంత్రి—లేదు.

దూత—చేసికొన నిష్టములేకనా?

మంత్రి—అది నే జెప్పజాలను. ఆమె నిర్జనప్రదేశముల నొంటరిగా నుండి రాజ్యపాలనమున దక్క వేరు విషయముల నెవ్వరితోడను మాటలాడదు.

దూత—మాసార్వభౌమునకు నదియే దశ ప్రాప్తించెను; కావుననే వివాహము నిశ్చయింపబడినది.

మంత్రి—అదే! మారాణిగారు విచ్చేసిరి.

(ఛాయాదేవి వచ్చును.)

దూత—రాణిగారికి జయమగుగాక !

ఛాయ—మీరా నన్ను జూడగోరినది?

ఛాయ—చిత్తము.

ఛాయ—ఏల?

దూత—మగధనుండి యీ మంత్రిణపత్రమును గొని వచ్చితి. (ఇచ్చును)

ఛాయ—అందరకు గుశలమా?

దూత—మీకటాక్షమున మాకందరకు గుశలమే.

ఛాయ—(ఉత్తరమును చదివి నలిపి పారవైచి) భారతసామ్రాజ్ఞి యనురోధమా? ఎవతె ఆసామ్రాజ్ఞి ?... కాదు కాదు-నే బోయెదను- మంత్రివర్యా! మనభాండారమున నున్న వెలగలరత్నముల నన్నిటిని జేర్చి యొకహారమును సిద్ధము చేయించుము.

మంత్రి—చిత్తము.

ఛాయ—ఎల్లుండి ప్రాతఃకాలమున మగధప్రయాణ మునకు సర్వము నాయత్త పరుపుము.

మంత్రి—చిత్త మట్లే కావించెదను.

ఛాయ—ఈతని విశ్రామాగారమునకు గొంపోయి యుచితరీతిని సత్కరింపుము.

(వారు పోయినవెన్క నుత్తరమును కన్నుల నద్దుకొని)

ఓహో? నా జీవనజీవనమా ? నాభాగ్యసర్వస్వమా? నీవు నావాడవుకావా? దాని వాడవైతివా? అట్లేల జరిగెను? నేనేకదా యామెచేతుల నాతనిచేతులలో నుంచితిని...ఇప్పుడు సహింపజాలకుంటిని...హృదయమా ! నీవేల యింకను గొట్టుకొనుచుంటివి? భూదేవీ, నీవేల శూన్యవై నాకగపడు చుంటివి; చంద్రగుప్తా ! చంద్రగుప్తా! చాయ లేదనుకొంటివా? ఆమె నీరాజ్ఞి కాదా; హృదయమా, దృఢపడుము. నిర్మల భావముచే నీప్రవృత్తి నుత్తరింపుము- వరదలై పారుచుండు వేడికన్నీరు నీపరాభవాగ్నిచే నెండజేయుము...ఎవరికొరకీ దుఃఖము? ఈమాత్రము సహింపనేరనా?...కాదు కాదు:—ఈ ప్రేమను సదమదము చేసెదను. వారిసుఖమే నాసుఖముగ నెంచెద. దుఃఖ మెవరికి? ఏల? ప్రియతమా! నీవు సుఖివై యుండుము- అదియే నాకు పదివేలు, నాకదియే నిరతిశయా నందము. వేరేమియు గోరను

---

## నాల్గవరంగము

(సెల్యూకసు శిబిరము)

సెల్యూ—యవనసార్వభౌముని దుహితయగు హెలెన్ విజాతీయుడు విమతస్థుడునౌ చంద్రగుప్తుని బెండ్లియాడుట యా? తుదకదియు ముగిసెనా? ఇప్పు డీపురమందలి సంరంభ గోలాహలము యవనుల పరాభవమును దశదిశల ఘోషించు చున్నది ... హెలె నింకను రాలేదు! ఆయుత్సవములచే మత్తురాలాయె గాబోలు? ముదుసలియగు తండ్రి యిట్టివేళ జ్ఞప్తియుండునా? సంతాన మెప్పుడును ముందునకే చూచు చుండును కానివెనుకకు జూడదు. దానిసర్వస్వము భవిష్య ద్దృష్టి. తండ్రిమొదలగు వృద్ధులు పశ్చిమగమ్యులే. కుమారు లకు విద్యాబుద్ధుల గరపి పెద్దవారినిజేసి, కౌమార్తెలకు వివా హములు జేసినపిదప తండ్రులేల జీవింపవలయు? సంతానము వారినొల్లదు. అయ్యో! తండ్రులదశ యెంతనిష్ఠురమైనది! వారి యగాధస్నేహమునకు ప్రతిఫలమేది? అదిగోనాకూతురు వచ్చుచున్నది (ఆమెవచ్చును) అమ్మా! నీకొరకు నిరీక్షించు చుంటిని.

హెలె—తండ్రీ!నిన్ను రా సభకు గొనిపోవుటకు నేనిట వచ్చితిని. రమ్ము పోవుదము.

సెల్యూ—నేను రాను కావుననే నిన్ను బిలువ నంపితిని.

హెలె—తండ్రీ! అట్లనెదవేల? నిన్నుగొనిపోవుటకే నేనువచ్చితిని.

సెల్యూ—నేను రాజాలను.

హెలె—నీకూతురుపెండ్లికి నీవు రాజాలవా?

సెల్యూ—నాకు మొగముజెల్లదు, ఇటనుండియే వీడ్కొనెదను.

హెలె—తెలిసినది. సరే-వచ్చుటయూ రాకుండుటయూ నీయిష్టములోనున్నవి. నిన్ను బలవంతముగా గొనిపోవుటకు నీవు నాకైదివా? .

సెల్యూ—హెలెన్! నాయందలి మోహము నిక వీడుము.

హెలె--అట్లనెదవేల? నిన్నభిమానించుటకు నాకధికారమెక్కడిది? నాప్రేమ అభిమానము, చనవు,అలుక మొదలగుబింకము లెవరికడ జెల్లునో, అట్టివ్యక్తి లేదాయె...నాకు సెలవిమ్ము.

సెల్యూ--ఇంతవేగమా? ఒకముహూర్తము విలంబమైనను సహింపలేవా? చాలుచాలు! హా! సెల్యూకసూ! ఏంతయో స్నేహము, ఎంతయో ఆదరము, ఎంతయో ప్రయత్నముతో నీవుపెంచినకన్య యొకనిమిషములో నిన్నువిడిచిపోవనున్నది, ఇక నీ కెవరుదిక్కు? కుమారీ! నాతోడి సంభం

ధము నేటితో శైంచితివా? నీకు తండ్రినికానా? నిన్ను పుట్టి నప్పటినుండియు బెంచుటచే తల్లినికానా ?

హెలె—తండ్రీ! నీకంట తడిపెట్టుచుంటివి, నే జూడ జాల; నాతప్పు సైరింపుము. ఇదియే నాకడసారి ప్రార్థనము. ఇక నిన్ను వేడుకొనను.

సెల్యూ—అమ్మా ! లెమ్మ. నాహృదయమందలి సాంద్రమగువేదన నీవెఱుంగజాలవు, ఆబాల్యము బెంచి పెద్ద జేసి, యెప్పుడు నెడబాయని కూతురి నామరణము బాసి యుండవలెనన్న తండ్రిమన మెంతగుందునో నీవూహింప జాలవు. పెద్దవారైన పిదప సంతానము జనకునివైపు జూడనే చూడరు. అందు వారితప్పేమియు లేదు, మానవధర్మమిది, జగమెల్ల నిట్లే వర్తించును. ఈవిషయ మెరింగియు నీయందలి స్నేహమునకు బ్రతిఫల మపేక్షించుట నాతప్పు.

హెలె—తండ్రీ ! వియోగదుఃఖ మొకతండ్రికే యుం డునా? తలిదండ్రుల విడిచిపోవనున్న తనయులగుండెలు బ్రద్ద లుకావా? ప్రేమను తండ్రియే యెరుంగునుకాని తనయ యె రుంగదా?

సెల్యూ—లేదు- లేదు- మీకును బ్రేమ లేకపోలేదు.

హెలె—మాకు ప్రేమ యెక్కడిది ?

సెల్యూ—ప్రేమలేకేమి ?

హెలెన్—తండ్రీ! నారీజీవితము ప్రేమపూరితము, బాల్యమున తల్లిదండ్రులు, యౌవనమున పతి, వార్ధకమున సంతానము-వీరితోడనే యామె ప్రపంచ ముండును. వీరియందే యామె యాశలు, ధైర్యము, సంపదయు సంక్రమించి యుండును. మగపులుగు తనగూటినివిడిచి గగనమండితసూర్యోజ్జ్వలనీలిమమున హర్షముతో సంచరించువేళ నాడ పులుగు తన రెక్కలవిప్పి గూడుచుట్టు తిరుగుచు దాని కాపాడుకొనును. పురుషులు శ్రాంతులైనతరి నారీప్రేమ ప్రమోదము నిచ్చును. వారలసులగునప్పు డుత్తేజనము గల్గించును. అవకాశము కల్గినపట్ల వారికి చిత్తవినోదము నాపాదించును. అట్టి ప్రేమయే స్త్రీలకు సదా చింతనీయము. ముఖ్యకర్తవ్యము. అదియే వారి జీవనసర్వస్వము-స్నేహమే వారి పుట్టినిల్లు. అందే వారు ప్పుడును జీవించుచుందురు. అదియే వారికి మృత్యువు. అనంతరమున స్వర్గమనునది యుండెనా, వారి కట్టి స్వర్గము నదియే. వారికదియేనిద్ర,అదియే యాహారము,అదియే విహారము- అదియే శయ్య. ఉచ్ఛ్వాసనిశ్వాసములు నదియే. ఇట్లుండ స్త్రీజాతికి ప్రేమయుండదని తలపకూడునా?

సెల్యూ—కుమారీ! నీవు చెప్పునది సత్యము.

హెలెన్—తండ్రీ! నీయందలిస్నేహముచేగదా సాటియువనుడగు నేంటిగోనుకను వివాహమాడకుంటిని. అది నీవెఱుంగవా? నే డీపట్టణమందెల్లెడ మ్రోగుచుండు మంగళధ్వనులు

నాచెవుల సోకునప్పుడు నాకెట్టి మరణబాధ కల్గుచున్నదో నీవెఱుంగుదువా? అందరునూ కలకలలాడుచున్నారు, కౌతుక ప్రవాహమున మున్గి తేలుచున్నారు; ఉత్సవసంరంభమున నోడలెఱుంగకున్నారు; కొందరు నాసౌభాగ్యమునుగని యీర్ష్య లేకున్నారు, నాకుమాత్ర మీవైభవము మర్మవిచ్ఛేద మొనర్పుటచే నేడ్పువచ్చుచున్నది. దాని నతిప్రయాసమున కంఠమందు స్తంభింప జేసితిని, కావున నది పైకిరాలేదు. నిన్ను విడుననున్న నాహృదయమును నెట్టి సంకల్పములున్నవో యిప్పుడైన దెలిసినదా? నాహృదయమును పరిశీలించిన నది ప్రళయసంక్షోభమున నెట్లు కొట్టుకొనుచున్నదో తేట తెల్లమగును.

సెల్యూ——కుమారీ! నీకు చంద్రగుప్తునిపై ప్రేమ లేదా? ఆతని నీవు వరింపవా?

హెలె——తండ్రీ! ఇంతమాత్ర మెఱుంగజాలవా?

సెల్యూ——అట్లైన నీవివాహమున కేల సమ్మతించితివి?

హెలె——వివాహమా! కాదుకాదు! ఇది నీకును నాకును మృత్యువు-నేను నాయాత్మను బలిగా నొసంగితిని.

సెల్యూ——ఏల?

హెలె——మానవహితమునకు ప్రపంచక్షేమమునకు నాత్మబలిదాన మొసంగితిని. యవనభారతీయ ద్వేషాగ్ని నా రక్తముచే నార్పితిని. యుద్ధ్యమాన జాతిద్వయమధ్యమున బడి వారిరువుర ఖడ్గాఘాతములకు నాహృదయ మొడ్డితిని.

సెల్యూ—ఈపని నీవేల చేసితివి? ఈవివాహము నా హృదయమునకు వ్రణమువలె నున్నదే-ఇదివరకొకసారి నీ యిష్టమునకు ప్రతికూలముగ వర్తించితిని, కావున నింకొక సారి యట్లు చేయలేక పోతిని. నీవు సుఖింతువనియే యీ వివాహమునకు సమ్మతించితిని. ఇది నీకు సుఖప్రదమైనచో నీయానందమునుజూచి నా వేదనల మరువదలంచితిని- నీవీ వివాహరూపారిష్టమును కోరి తెచ్చుకొంటివని యెరింగినచో...

హెలె—ఇది కేవలదుఃఖదాయకమైనచో నేనుదానిని కోరి తెచ్చుకొందునా? పరుల హితమునకూ విధ్యుక్తధర్మమునకు నాత్మబలిదాన మొనంగుట పరమసుఖదాయకము. దాన నుల్లాసము గౌరవమును ప్రాప్తించును.

సెల్యూ—నీకిదిగౌరవదాయకముగ నున్నదేమో కాని యవనులకు పరమలజ్జావహము సుమా.

హెలె—లజ్జయా? ఇట్టిగొప్పవివాహము ప్రపంచమున నిదివరకెన్నడైన జరిగినదా? ఈపెండ్లిమూలమున ననాదినుండియు సంభవించుచుండిన తుపానణగినది. దూరస్థలములగు నార్యజాతులు నేడు పరస్పరాలింగన మొనర్చుచున్నవి. ఈవివాహము కేవలము మాయిద్దరకేయని జెల్లదు... కర్మమోక్షములకు—చింతాకల్పనలకు— విజ్ఞానకవితలకును సమాగనుము దీనివలన ఘటిల్లుచున్నది. ఈపెండ్లిమూలమున రెండు నాగరకవ్యవస్థలకు మధ్య సేతుబంధమయ్యెను.

రెండు గొప్పసభ్యదేశము లొకటియయ్యె. ఇట్టి వివాహ మిది వరకెన్నడైన జరిగినదా?

సెల్యూ—అట్లు తెలియవచ్చుట లేదు-కాని—

హెలె—తండ్రీ చక్కగా బరిశీలింపుము. ఈవివాహమున ప్లేటోకపిలులు కలిసి గానము సేయుచున్నారు; సోలను మనువులు భుజములపై చేతులు వేసికొని నిలువబడియున్నారు; వాల్మీకివీణాగానముచేయ హోమరు మృదంగమువాయించుచున్నాడు. హెరొడొటసు వ్యాసులు, సోక్రటీసు బుద్ధులు, ఏకిలీసు భీష్ములు, పేన్తియన్ పురాణములు నైక్యత జెందుటకు హేతువీవివాహమే కదా? మరియు బూర్వపశ్చిమఖండములు- సముద్రాకాశములు- స్వర్గమర్త్యములు-ఇహపరములొండొంట దారసిల్లినవి. ఇట్టి మహావివాహ మీనాడు జరిగినదికాని యితఃపూర్వము జరుగలేదు-ఇతఃపరము జరుగునో జరుగదో యెరుంగజాలము.

తండ్రీ! ధూలదృష్టిని జూచిననూ చంద్రగుప్తుడుదక్క నాకుదగిన వరుడు లేడు. నీ సాటియవనభూపతులకు బుత్రసంతానము లేదు- యవనులలో నీతోడి సమాన గౌరవము నకుబాత్రుడు లేడు. ఏంటిగోనసుండెను, కాని యాతనికథ గతజలసేతుబంధము కదా?...చంద్రగుప్తుడు మాత్రమేమిటదక్కువ?—మహప్రతాపసంపదల, శీలమున, శ్రుతమున, సౌభాగ్యమున యశమున నీకీడుతీయుడు. ఇహపరశ్రేయోదాయక

మగు నీవివాహమునకు బ్రణేతవు నీవని నీయశ మాసేతు శీతాచలమేకాక యఖండ వ్యాప్తముకాదా? దీనదోసగేమియు లేదు, కావున నీవు వింతదాలగి నన్నాశీర్వదించి పంపుము.

సెల్యూ—అమ్మా! నీమూలముననే కదా యవన జాతియంతయు ధన్యతజెందె. నీకు సుఖము చేకూరుగాక! నీవియోగదుఃఖము నెట్లెటో మరచెదను.

హెలె—తండ్రీ! విధ్యుక్తధర్మము నన్నాహ్వానింప నితరముల సరకుసేయుటకు వీలుచిక్కుటలేదు. కావున నిన్ను వీడిపోవుచున్నదాన (నమస్కరించును). యావజ్జీవము నీపాద స్మరణమే సంజీవిగా భావించెదను, జగదీశా! నాతండ్రియశో దీపమునకు నాజీవితమును స్నేహమర్పించుచున్నదాన. ఈ యుపహారమును గైకొనుము. సర్వేజనాః సుఖినో భవంతు.

(పోవును)

సెల్యూ—అమ్మా! భారతవర్షసామ్రాజ్ఞీ! నీచర్యయు పూర్వము. స్వర్గీయము. ఇట్టి స్వార్థత్యాగ మిదివర కెవరునూ కావింపలేదు. ఇక నాదేశమునకు మరలిపోవుదును. ...అయ్యో! ఎట్లు పోవనేర్తు? ప్రపంచమంతయు నంధకార బంధుర మగుచున్నది, త్రోవకాన్పించదు. అమ్మా! నీవు నాకు చేదోడువాదోడుగా మెలగుచుంటివి. ఇప్పుడునన్నెవరి కప్పగింతువు? వార్ధకమున సంతానమేకాదా తండ్రులకుపట్టు గొమ్మ. నన్ను దిక్కుమాలినపక్షి జేసి చీకటిలో ద్రోసితివి.

ఇకనా రాజ్యమును నావైభవమును చూచి యానందించువా రెవరు? నా యనంతరమున వాటిననుభవించు వా రెవరు? నావంశము నాతో నంతరింపవలసినదేనా?

(ఏంటియోకసు వచ్చును.)

ఏంటి—జయము! జయము యవనసార్వభౌమా!

సెల్యూ—ఏమి యీ శుభసూచకము! ఎవరిది?

ఏంటి—నేను, ఏంటియోకసును.

సెల్యూ—నీవా! ఈసమయమున? నిక్కడ?

ఏంటి—సార్వభౌమా! రిచ్చవడుచుంటివా?

సెల్యూ—నాయపజయమునకు నన్నెత్తిపొడువవచ్చితివా?

ఏంటి—లేదు. లేదు.

సెల్యూ—నీ రాకకు హేతువేమి?

ఏంటి—నాతండ్రివృత్తాంతము నెరింగింపవచ్చితిని.

సెల్యూ—ఇప్పుడేమిలాభము?

ఏంటి—లాభము లేకేమి? ఎట్టిలాభమును లేనిచో నీవృత్తాంత మరయుటకు యవనదేశమునకు వెఱ్ఱివానివలె నేబోవనేల? అచ్చటనుండి యింతదూరముతిరుగరానేల? ప్రయోజనమున్నది.

సెల్యూ—హా లెక్ చంద్రగుప్తసార్వభౌమునకు పట్టమహిషియైనది.

పంటి—చాలసంతోషము. ఆతనికన్న యోగ్యతరు డగు వరు నామె బడయజాలదు, నే నిదే రాజసభ కేగి దంపతుల నాశీర్వదింతును.

సెల్యూ—పరియాచక మాడుచుంటివా ?

పంటి—ఇది పరియాచకము కాదు-సార్వభౌమా! నేనుసత్యమునే పల్కుచుంటిని. నాపై నొకవిశాలజలప్రవాహము పారి నాకంటియున్న మాలిన్యమును తుడిచికొనిపోయెను. అనంతరము మిగిలినది—భగ్నశిలాస్థూపము. అందలి ప్రత్యేకఖండికయు గగనముకన్న నిర్మలతరము, వజ్రముకన్న కఠోరతరము; దీర్ఘతపోబలమున నామాంసమంతయూ కరిగి జారి పోవుటచే కేవలకంకాళమే మిగిలియున్నది. కాని అందలి యెముకలన్నియు పవిత్రములు. నాకళంక మగ్నిదగ్ధమయ్యె. ఇప్పుడుమిగిలినది స్వచ్ఛమగు నపరంజి.

సెల్యూ—నీమాటలు నాకు బోధపడుటలేదు.—నీభావమేమి? తేటతెల్లముగా వచింపుము.

పంటి—సకామప్రేమను నిష్కామప్రేమచే శుద్ధిజేయుట—మర్త్యునకమరత్వము నమకూర్చుట—భూలోకమును స్వర్గముగామార్చుట-మొదలగుపనులు మానవునకసాధ్యములని భావింపుచుంటిని. కాని సాధనగల చోట్లనెల్ల సిద్ధి కలుగుచుండును. ఈవిషయ మిప్పుడు నాకనుభవసిద్ధమైనది. కావున హెలెనునెడ నాకు సోదరప్రేమ కలుగుచున్నది.

సెల్యూ—నీవే విషయము నుద్ఘాటించుచుంటివో నేను తెలియజాలకున్నాను.

ఏంటి—ఔను. ఇది మీకెట్లు తెలియును? గతము మీకెట్లుస్ఫురించును? ఏమహానుభావు డమాయికురాలగు నొకకృషకకన్యను మిథ్యాశలపాలుజేసి, ధర్మానుసారము పెండ్లియాడి యనంతరము సపుత్త్రికముగ బిచ్చమెత్తుకొమ్మని ప్రపంచమున కప్పగించి, పురందరగురువిభవముతో దాను సామ్రాజ్యపదవి నొందెనో, అట్టివా డీమాటలయర్థ మెట్లెరుంగు? సార్వభౌమా! నిర్భాగ్యురాలగు నాయువతీమణి పరలోకమున కేగినది. మీనిర్మమపరిత్యాగము, ఖడ్గాఘాతము నొనర్పజాలని యాకార్యము నాపరిచయ మొనర్పగలిగెను. నాతల్లి ప్రేమప్రవాహమున గొట్టుకొనిపోయెను. అట్టిదుర్భర దుఃఖానంతర మిట్టియుత్కటసుఖము నిర్భరమయ్యె. సార్వభౌమా!...

సెల్యూ—నాకన్నులను గాఢాంధకార మావరించి నట్లున్నది? నీవెవడవు?

ఏంటి—నేనా! అమ్మబడిన బానిసీడ-బిచ్చగాడను. మీ రేమనుకొనిన నట్టివాడను, కాని జారజుడ మాత్రము కాను. నాతండ్రి నాతల్లిని యథావిధిగా బెండ్లియాడెను. రహస్యమైననేమి?

సెల్యూ—ఓయీ! నీతండ్రియెవరు? తల్లియెవతె?

ఏంటి—నాతండ్రియా? వాని నెరింగించుటచే మీకు తలవంపులు ఘటిల్లునేమో యని సంశయించుచున్నాడను, ఐన ను ప్రభువులయాజ్ఞ మీరరాదు కావున చెప్పుటకు సాహసించెదను. నాతండ్రి యత్యాశాపరవశత పత్నీత్యాగమొనర్చిన యవనసార్వభౌముడు-సెల్యూకసు. తల్లి అపామా. (సెల్యూకసుని శ్రేష్ఠుడై యుండ నాతడుపోవును.)

---

ఐదవరంగము.

---

(మగధరాజు కొలువుకూటము-చంద్రగుప్తసార్వభౌమునిసభ)

చాణ—చంద్రగుప్త సార్వభౌమా! నీబాహుబలమున హిందూకుష్ పర్వతము మొదలు సేతువువరకును వ్యాపించి యున్న రాష్ట్రము నార్జించితివి. ఇంతె సామ్రాజ్య మింతవర కెవరును స్థాపింపలేదు. యవనవాహినీపతి త్రుళ్ళడగినది. భరతఖండసార్వభౌములలో ప్రప్రథముడ నీవని నీయశ మాచంద్రతారార్కము వర్ధిల్లుగాక!

చ॥గు॥ గురుదేవా! మీరు సూత్రధారులై నాచే నీనాటక మాడించితిరి.

చాణ—వత్సా! నేను నిమిత్తమాత్రుడను, సర్వము నీవే నిర్వహించితివి; నాపని తీరినదికావున నాకు సెలవొసంగుము, నేబోయెద.

చ॥గు॥—గురువర్యా! నన్ను వీడిపోవుటకు నేగావించిన యపరాధమేమి?

చాణ—నీ వపరాధముచేసితి వనికాదు. దర్పము, ఉచ్చాశ, ప్రతిహింసయు బ్రాహ్మణోచితప్రవృత్తులు కావు. నేనింతవఱక జరిపినచర్య యద్భుతమయ్యు బ్రాహ్మణో చిత కర్మగాదు. క్షమ, తితిక్ష, వైరాగ్యమును తద్ధర్మములు. నీవు సంపాదించిన విశాలరాష్ట్రమును యోగ్యుడగు నీకాత్యాయనమంత్రి సాహాయ్యమున పాలించుకొనుము.

చ॥గు॥—మీరలో?

చాణ—నేనింక ప్రజాశాసన మొల్లను. అమ్మా? ఇటు రా. భ్రాంతుడనగు నాపై పుత్రప్రేమజూపి నారెండుచేతులను యశోదాదేవి స్నేహబలమున వెన్నదొంగచేతులను కట్టినట్లు కట్టివేయుము. కాత్యాయనా ఈమటుమాయ మెరింగితివా? బాలిక మోహమంత్రముచే పాషాణము కరిగి పానీయముకన్న పల్చనై పారుచున్నది. ఎండినమోడు చిగిర్చెను. శుష్కతప్తమరుభూమిపై సుధాంబుధిలహరి తాండవమాడుచున్నది. అమ్మా! ముందుపద- నాజీవితగోధూళిలగ్నమున జ్యోత్స్నాలోకము నుత్పన్నము సేయుము- లోకమాతవలె నాజీర్ణకుటీరమున నావిర్భవించి నాచేయిపట్టి నన్ను స్వర్గమునకు జేర్పుము సభాసదులారా! నాకనుజ్ఞనిండు. నేబోయెద-

స్వస్తి ప్రజాభ్యః। పరిపాలయంతాం న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః...(పోవును)

చ॥గు॥—ఈ పవిత్ర దేహమున నెంత ప్రేమపూరిత మగు హృదయమున్నది!

కాత్యా—సార్వభౌమ శేఖరా! ప్రకృతి ప్రకృతిస్థమైనది. ఇట్టి యనన్యసామాన్యప్రజ్ఞ హృదయశూన్యమై యుండునా? నియమరాహిత్య మెంతకాలము నిలువగలదు!

(మురవచ్చును)

ముర—నాయనా! నీకు జయమగుగాక! "శూద్రస్త్రీ" అను నపనిందకు దగినప్రతీకార మీనాడొనర్ప బడియె - శూద్రస్త్రీ గర్భమున జనించినవా డీనాటికి భువనవిజయియై భారతసార్వభౌముడయ్యెను.

చ॥గు॥—అమ్మా! నీవే రాచంద్రార్కము ప్రపంచస్థాయి యగునట్లు నావంశము "మౌర్యము" నుపేర వరలుగాక!

ముర—తండ్రీ! నిన్ను కన్న ఋణముదీర్చితివి. మీదంపతులు చిరజీవు లగుదురుగాక, అమ్మా! గృహలక్ష్మి! మా వంశము నుద్ధరింపుము.

చ॥గు॥—దేవీ! నే డొకప్రియస్వనము వినబడకుండుటచే నీజయధ్వని ప్రకాండము నాహృదయమున కాహ్లాదజనకము కాకయున్నది.

హెలె—ప్రాణేశ్వరా! ఆప్రియస్వర మెవ్వరిది ?

చ॥గు॥—నాప్రియబంధువగు చంద్రకేతు లేకుండుటచే నాచిత్తమున కానందము సేకూరదాయె. నాదక్షిణ

బాహువు భిన్నమైనట్లున్నది. ఆతడు లేకుండుటచే నేటివిజయోత్సవము చంద్రుడులేని రాత్రివలె శోభింపదాయె.

హెలె—ఆలోపము పూర్తి నొందింప జాలము.

చ॥గు॥—నిజము- ఇచ్చిపుచ్చుకొను నీకాలమున ప్రత్యుపకార మపేక్షింపక మేలుగోరువాడు, తనగుణగణము మెచ్చుకొన వినసహింపనివాడు, తనసర్వస్వము నొరునకు ధారవోయువాడునగుబంధు వెంతఅప్రియతముడో, అట్టివాడు గతించిననెట్టిదుఃఖముకల్గునో, అదియనుభవైక వేద్యము. ఆహో! అట్టిమిత్రునెడ నుదాసీనభావము వహించుటయే కాక,యాతని తో కలహించితిని. నాతిరస్కారము నాతడు గణనసేయుటయే లేదు. నాయపరాధమును క్షమింపకయే మిత్రుడు గతించుటచే నేను యావజ్జీవదోషినైతిని. ఇందునకు పరిహారము లేదయ్యో.

(ఏంటిగోనుకసువచ్చును)

ఏంటి— హెలెన్! కుశలమా ?

హెలె—(నివ్వెరపడును)

ఏంటి—యువతీశిరోమణీ! నీ వివాహవేళ శుల్కముగనర్పింప యవనదేశమునుండి యీహారమును దెచ్చితిని, సోదరీ! దీని భ్రాత్రాశీర్వచన సహితముగాగ్రహింపుము... భారతసార్వభౌమా! చంద్రగుప్త మహారాజా! మీకొరకు వెలలేని మణులుదాపిన యీచంద్రహాసము నుపహారముగా

దెచ్చితిని. దీని యరణముగా గొనుము. సామ్రాజ్యధురంధ రత్వమున నిది యమితోపయోగకారి యగును.

చ॥గు—అయ్యా! మీర లెవరు?

ఏంటి—రాజాధిరాజా! నన్ను గుర్తింపనేరరా? మిమ్ము నే మరువలేదు. ఎవనిశస్త్రాహతిచే సింధునదీతీరమున సికందరుషా సమక్షమున నాశస్త్రము తుత్తునియలాయెనో, అట్టి వీరవరేణ్యుడు మరపువచ్చు టెట్లు? ఇంతకును దైవమను కూలించినది- ఆదెబ్బవలన నన్ను పితృహత్యామహాపాతకము నుండి తొలగించినవాడవగుట నాకు పరమాప్తుడవు. నిన్ను నే మరచుటెట్లు;

చ॥గు—ఏనాటిమాట? ఆహా! సికందరుషా జ్ఞప్తికి వచ్చె, నేడెంతసుదినము! ఆసార్వభౌముని భవిష్యద్వాణి నేటికి ఫలించె-అయ్యా! నీతండ్రి యెవరు?

ఏంటి—యవనసార్వభౌముడగు సెల్యూకసు.

హెలె—ఏమి? సెల్యూకసు నీకు దండ్రియా?

ఏంటి—సోదరీ! అగును. నీవు నాయెడ విముఖురాల వగుట యెంతయో శ్రేయస్కరమయ్యె, అదియు నీశ్వరేచ్ఛయే. —ఇప్పుడు సోదరభావము జూపుదువా?

హెలె—ఏంటిగోనస్! నీవు నాకు సోదరుడవా? ఏమి యీవిప్లవము? ధ్వంసము, సృష్టి; మృత్యువు, పునర్జ న్మము నొకతడవనే కానవచ్చుచున్నవి. సోదరా! సోదరా!

ఏంటి—సోదరీ! మనము ధన్యులము!

హెలె—నేడు గొప్పపర్వతమునుబోలు బరువును నా హృదయమునుండి పారదోలితివి. ఇక నిరాఘాటముగా నూపిరి తీసుకొందును. అన్నా! నన్ను క్షమింపుము. ఎరుకలేమిచే నిన్నెన్నియో నిష్ఠురము లాడితిని, వాని సైరింపుము.

ఏంటి—అమ్మా! వాని నిప్పుడు తడవనేల? మహారాజా! నీవు నేడు వరించిన వరయువనరత్నమును నీహృదయమున ననిశమునుదాల్పుము. మాపిల్లయని చెప్పుటకాదు, ఇట్టి కాంతాలోకచూడామణి. "న భూతో న భవిష్యతి" త్రిమూర్తుల యర్థాంగు లేకీభూతలయి భూలోకమహావిష్ణువగు నీకు తగిన ట్లీకన్యను సృజించియుందురు. రూపమున నిదాఘుని శ్లేఘ ప్రభాతము మ్లానితమగును, ప్రావృడంబుదలీనమగు విద్యుచ్ఛవి లజ్జితయగు; విద్యయందు భారతి యీామెకు సహపాఠియనజెల్లును, అంతఃకరణ మద్వితీయ ప్రతిభాశోభితము, ననన్యసామాన్యము. ఈమె రూపమున నప్సర, యంతఃకరణమున లోకమాత. ఇది స్వభావోక్తు లని నమ్ముము.

(ఛాయ వచ్చును)

ఛాయ—భారత సార్వభౌమ దంపతులకు జయమగుగాక!

చ॥గు—ఓహో! ఛాయాదేవీ! ఇటురమ్ము. ప్రియమాణమగు నీ యుత్సవముపై నీ స్నేహరసనంజీవిని వెదచల్లుము.

ఛాయ—సమ్రాట్! భారతసామ్రాజ్ఞి పెండ్లికట్న మునకై యథాశక్తి నీచిన్నికానుక నర్పించుట కిటవచ్చితిని. మీ రనుజ్ఞ దయజేసినచో నాచేతులతో నీహారము నామె కంఠసీను నలంకరించి నాదారిని బోయెదను.

చ॥గు॥—ఛాయా! ఎటుబోవ నెంచితివి ?

ఛాయ—ప్రభూ ! విపులబ్రహ్మాండమున సన్యాసిని యగు ఛాయకు చోటుదొరకదా ?

చ॥గు॥ దేవీ! నాకాప్తబంధువగు నీయన్న చంద్రకేతు వీరస్వర్గమందలి యభిమానముచే నన్ను పరిత్యజించి పోయెను. నీవుకూడ విసర్జింతువా ? నీవైన నాచెంతనుండి నాకాప్త బంధువవై యాతనికిమారుగ నాహృదయమందలి లోపమును పూర్తి చేయవా ?

ఛాయ—మహారాజా! మీమాటనజవదాటను. అట్లే యుండి నాయభిమానము నెట్టులేని చంపుకొనియెద... ఈ యగ్నిపరీక్ష సహింపగలనను ధైర్యము పొడముచున్న ది...ఊ...కానిండు...మీయొద్దనుండి మీసుఖమే నాసుఖ ముగ భావించుచుండెదను. ఈయసిధారావ్రతమే నాజీవిత పరమావధి, నాతపము ఫలించునట్లు వరమొసంగుడు. (తలవంచును)

హెలె—(ఛాయహస్తమును పట్టి) ఛాయాదేవీ! నాతో నొకమాటాడవా, మొగమెత్తవా? నీవు దుఃఖిం పనేల? నీయన్న చంద్రకేతు మహారాజునెడ సోదరభావ

మూనియుండె. నీవు నట్లే నాయెడ సోదరీభావము వహింప రాదా ? మాయండనున్న నీకేమిలోపము ?

ఛాయ—దేవీ ! అట్లే కానిమ్ము. నీవుపద్మినివి, యవన వనితవు; నేనో నల్లనిదాన నసభ్యజాతిదానను.

హెలె—అట్లైన మనమిద్దరము గంగాయమునలవలె నుందము. సూర్యకాంతియు నీలమేఘమును కలిసినచోట నింద్రధనస్సు నిర్మితము కాలేదా ?

చ॥గు॥—నల్లనిదానవనియు భిల్లవనితవనియు చింతించుచుంటివా ? ఛాయా! గుణముప్రధానము గాని వర్ణము ప్రధానమగునా ? నేను మీవీట తలదాచుకొనిననాడే నాకు నీపై మోహమంకురించె. నీవు మహారాజు బిడ్డవు-కాలమప్పుడు నాయెడ విపర్యస్తమగుటచే నామనోభావముల నణచికొంటి. చంద్రకేతు వీరస్వర్గమునకు బోవనున్నతరి నాకు నిన్నప్పగించె. ఇదే ప్రేమభిక్ష యాచించుచున్నవాడ, విముఖురాలవు గాకుము. నీవు పరితపింపనేల? పద్మిని యర్ధాంగి యయ్యె; నీవును నర్ధాంగివికమ్ము.

హెలె—చెల్లెలా! సూర్యచంద్రు లొకయాకసమున నుదయింపలేదా ? నన్ను బెరదానివలె జూచెదవేమి ?

ఛాయ—దేవీ! అట్లనకుము. నాదుఃఖము నేసహింతు. అట్లుచేయలేకున్న నాడుదాననై పుట్టి యేమిఫలము ? ఈ హారమును నీకంఠమున వేయనిమ్ము-నీముఖము, నీసౌందర్యము,

నీహృదయము నద్వితీయములు నపూర్వములు. మాచంద్రగుప్తున కర్ధాంగివగుటకు నీవేయర్హురాలవు. నాకే విచారమును లేదు. నన్ను దలపకుడు. ఈహారమును నీకంధరమునకై సేయనిమ్ము.

హెలె—అట్లయొప్పుకొనెద గాని ముందు నీవు నాకోర్కె నెరవేర్తువేని ఆవెన్క నీయిష్టముచొప్పున జేయనిత్తును. నాకీహార మక్కరలేదు; వేరొకకోర్కె కోరెదను.

ఛాయ—నేను దీర్పగల కోర్కెయైనచో నెరవేర్పసిద్ధురాలను.

హెలె—నీమాట నమ్మవచ్చునా? చెప్పినపిమ్మట జేయనందువేమో!

ఛాయ—నీకాసంశయము వలదు. నేను మాటతిరుగను- మహారాజే సాక్షి!

చ॥గు॥—ఛాయమాటకు మారులేదు.

హెలె—చెల్లెలా! నీవించుక పొరబడితివి. ఈహారమెచటనుంచవలయునో తెల్పెద. (ఛాయ చేతులుపట్టుకొని చంద్రగుప్తుని కంఠమున హారమును కీలించును.)

కాత్యా—అయం ముహూర్త స్సుముహూర్తోస్తు!

సభ్యులు—తథాస్తు.

హెలెక్—అంతకన్న విలువగల నీభుజలతిక నాకంఠమున బెనవేయుము. ఛాయా! ఇప్పుడు నీవు నాకు నిక్కముగ జెల్లెలవైతివి.

కాత్యా—పద్మినీ భార్యాసమేతుడగు చంద్రగుప్త మహారాజునకు జే!

మురా—నాయనా! చంద్రగుప్తుడను నామము నేటికి నీకు సార్థకమయ్యె.

ఏంటి—సభాసదులారా! నాసోదరి స్వార్థత్యాగము నకు మీరచ్చెరువందుచుంటిరా? ఆమె వృత్తాంతము సాంత ముగ విందురేని యిదయొక వింతగాదోపదు. ఆమెహృదయ వృత్తు లవాఙ్మానసగోచరములు...మహారాజా! మాహెలెను నకు సోదరి ప్రాప్తించె, మీరు చంద్రకేతువునకు మారుగ నన్ను సోదరప్రేమతో చూచుచుండవలయునని ప్రార్థించు చున్నవాడ. జగన్మిత్రులగు మీకు వేరజెప్పనేల!

చ॥గు॥—యవనశేఖరా! ఒకరికి మారుగ నననేల! మన మాబాల్యస్నేహితులము. సన్నిహిత రాష్ట్రస్వాము లము, కావున సోదరులమే. ఆబంధము నీవివాహాము మరింత దృఢపరచినది. సోదరా! గాఢాలింగన మిమ్ము.

కాత్యా—సః నావవతు। సః నౌ భునక్తు। సహా వీర్యం కరవావహై। తేజస్వినా వధీత మస్తు। మా విద్విషావహై॥

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

సమాప్తము

---

# సవరణ

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| 2 | 19 | తేజమున | తేజము |
| 65 | 8 | మాడుచు | చూడుచు |
| 178 | 7 | అప్రియతముడో | ప్రియతముడో |